# పగటిచుక్క

## తృతీయభాగము

గ్రంథకర్త:
పిల్లలమఱ్ఱి గోపాలకృష్ణయ్యగారు
తెనాలి



పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.
1955

 [వెల 1—0—0

ఇట్టి స్వల్పవిషయములు సహితము గృహము పూరి
దని నొక్క చెప్పుచుండెను.

లోపల నొకగదిలో ప్రాతతివాసీపై మాణి
కూర్చుండి, ముఖముపైకెత్తి తనకు గొలది దూరమున
యున్న పురుషోత్తమరావుతో నేమియో గాంభీర్యమ
ప్రసంగించు చుండెను. పురుషోత్తమరావు నిర్లక్ష్యభావము
నిలచెను. ఆతని నేత్రములును, చూడ్కులును మోహ
భావము నొలికించుచుండెను. మాణిక్యము వదన మతిసాహ
సూచకమై యామె మనస్థైర్యమును వెలిబుచ్చుచుండెను.

'కాంబట్టి — కాంబట్టి — నామాటవినవు వినవుగాదా'
అని పురుషోత్తమరావు గంభీరస్వరముతోఁ బలికెను.

'నీమాట కాదు — నీ నీచపుసలహా!' అని యామె
హేయభావముతో సమాధానము చెప్పెను.

'నానీచపు సలహా! నేను నీచుడనా?'

'కాదా మఱి?'

'కాదు, పిల్లా! నీవు పొరబడుచున్నావు. నేను నీచుఁ
డనుకాను. నీవు కృతఘ్నురాలవు — మఱియు —'

'అయ్యో! మీదూషణ కట్టిపెట్టుడు!'

'మాణిక్యం! నీవు పిచ్చిదానవు'

'మాకంటెనా?'

'మున్మాటికిని'

'నాఅభిప్రాయము వేఱు'

'సహజమే'

'మీకువలెనే'

పురుషోత్తమరావామెను కొలదిగ సమీపించెను. తటాలున మాణిక్యము విసురుగ లేచెను. ఆమె వాడిచూపునకు బెదరి యా మోహాంధుడు నిర్ఘాంతపోయి వెనుకంజ వేసెను:

'మర్యాదగా దూరమున నుండుము. సమీపమునకు వచ్చిన—నా—నా—స్త్రీ సాహస మెఱుగవా?

'ఏమి చేసెదవు?'

'నీవో, నేనో'

'ధీరురాలవే!'

'నాధైర్యమును బరీక్షింపకుము. భద్రముసుమా!'

పురుషోత్తమరావు రెండడుగులు వెనుక వేసి గోడ నానుకొనెను. ఆతనిదృష్టి మాత్రమాసుందరి ముద్దుమోము నుండి మరలలేదు. ఆతడు దానిని త్రిప్పజాలడు. అంత దృఢముగా నది యట నతుకుకొనెను. మాణిక్యము తిరిగి యూసీనకాలేదు.

రెండు నిముసము లట్లు గడచెను. ఎట్టకేలకు మిక్కిలి శాంతముగా వక్షముపై జేతులు మడిచి యిట్లనెను.

'నేను నిన్ను బలవంతముగా—'

'నీజన్మలో చేయజాలవు!' అని భయంకరముగా నుచ్చరించుచు మాణిక్య మాతని కడ్డమువచ్చెను.

'ఏమి చేయజాలను?'

'నన్నంటజాలవు'

'చూచెదను'

'ప్రేలకుము. పతివ్రత మానభంగసమయమున భూత ముగా మారి ఎదుటి వారిని హతము చేయును.'

'నీవు పతివ్రతవా?' అనుచు పురుషోత్తమరావు వికట మందహాస మొనరించెను.

మాణిక్యము నిరుత్తరయాయెను.

'నీకేపతియందు వ్రతము?' అనుచు నాతడు పరిహాస ముగా, ధిక్కారముతో నడిగెను.

'నాప్రాణపతియందు.'

పురుషోత్తమరావు వదనమున గాంభీర్య మొక్క మారుగ నుబికెను.

'నీప్రాణపతియా?'

'అవును.'

'ఆత డెవ్వడు?'

'నీ కనవసరము.'

'చెప్పగూడదా?'

'చెప్పను'

'పేరు చెప్పుము.'

'దేనికి ?'

'విని సంతసింతును.'

'తుచ్ఛుడా నీవాతని నేమియు జేయజాలవు. విని దుఃఖించుము. చెప్పెదను.'

'చెప్పుము'

'జస్వంతరావు'

మాణిక్యమాతని ముఖమును బరిశీలించెను. అందెట్టి మార్పును జరుగలేదు. పురుషోత్తమరావు గంభీరముగా యోజించుచుండెను.

'మాణిక్యం! నేననిన నీకేల రోఁత?' యని యాతడు కొంతకాల ముండి శాంతముగా నడిగెను.

'నీచర్యలచేత'

'నేనేమి చేసితిని!'

'నన్ను వంచన.'

'ఆవిషయము నేరమా? అది నా మోహాతిశయమును జూపుచున్నది. నాకోరిక వినవా ?

'మన యిరువురిలో నొకరు బ్రతికియుండగా పొసగదు'

'నేటిరాత్రి మఱియొకమారు సాహసముప్రయత్నించెదను. అది కడసారి సుమా.'

'తరువాత?'

'నన్ను హరిహరాదులాపలేరు'

లేపు నీవుండవు.

'నాకు లక్ష్యములేదు. నీచేత చావైనను నాకిష్టమే'

'తథాస్తు! అని యాసుందరి యతిశాంతముగా బ్రత్యుత్తరమిచ్చెను. ఆకంఠస్వరము గొప్ప బెదరింపులకంటె మిక్కిలి భయంకరముగ నుండెను. పురుషోత్తమరావు గ్రహించలేదు. కాని యాతడు సరకుచేయలేదు.'

'రాత్రికి సిద్ధురాలవై యుండుము.'

'నిన్ను రూపుమాపుటకా?'

'దానికైనను సరే'

'మంచిది. స్త్రీలు అబలలుగారు సుమీ!'

'నిజమని అనుభవముచే దెలిసికొంటిని.'

'వారికి దోడులేదని తలపకుము.'

'నీకెవ్వరు ?'

తలుపుదట్టిన శబ్దమాయెను. పురుషోత్తమరావు విసుగుతో దలుపు తెఱచెను. నిర్లక్ష్యభావము మూర్తీభవించినట్లు ఆదుర్ముఖము ప్రవేశించి చుట్టవెలిగించెను.

---

## రెండవ ప్రకరణము

### వేయి రూపాయలు

పురుషోత్తమరావు వదనము మాటాడినట్లయ్యెను. ఉన్నట్లుండి యొకమారుగ నది నల్లబారెననుట యతిశయోక్తి కానేరదు. అతఁడేమియు మాటాడలేదు. అర్ధముఖము తివాసీపై నాసీనుడై మాణిక్యము నేకదృష్టిగ జూచుచు బాగవదలుచుండెను. ఆజవ్వని యీ పిశాచద్వయమునకు దూరముగా గదిలో నొకమూల నిలిచెను. కొంతకాలమామె ముద్దుమొగమును గమనించి, నోటినుండి చుట్టదీసి పొడియార్చుచు అర్ధముఖము చిఱునవ్వుతో నిట్లనెను.

'గోవిందంపంతులు! చక్కని దానిని ఏరినావయ్యా! మొన్న ఈపిల్లను స్టేషనుమాష్టరు ఇంటినుండి నేను, ఓంకారము ఎత్తుకొని వచ్చునప్పుడు సరిగా చూడలేదు. పిల్ల రత్నముసుమా!'

పురుషోత్తమరావు ప్రత్యుత్తరమీయలేదు. అర్ధముఖము నిర్లక్ష్యముగ చుట్టను పీల్చుచు మరల నిట్లనెను.

'గోవిందంపంతులు మాటాడవేమి?'

'నన్నా పేరున పిలువవద్దని చెప్పలేదా?'

'నిజమే. అయిన దాసరిపల్లిలో భయములేదు.'

'ఏమో ! గోడలకు చెవులుండును.'

'మంచిది పురుషోత్తమరావ్ పైకము వచ్చినదా?'

'ఇంకను రాలేదు.'

'ఎప్పుడు వచ్చునో ?'

'రెండు దినములలో తప్పక రాఁగలను.'

'నిజముగా.'

'తప్పక.'

'పురుషోత్తమరావ్ ! నన్ను తేఱిపాఱ చూడుము.'

'దేనికి ? చూచుట లేదా?'

'నా పేరేమి ?'

'అర్ధముఖము ?'

'అర్ధముఖము అనిన మాటను తప్పని వాఁడని తెలియునా?'

'తెలియదు'

'తెలియదా ? త్వరలో తెలిసికొనఁగలవు'

పురుషోత్తమరావు మాటాడక మాణిక్యమువంక జూచెను. ఆమె వారి సంభాషణ నతిజాగరూకురాలై యాలకించుచుండెను. అర్ధముఖమును, ఆసుందరిని గంభీరముగ నొకింత కాలము తిలకించి మరలఁ బురుషోత్తమరావువైపు తిరిగి యిట్లనెను.

'సొమ్ము—వేయి రూపాయలు ఈదలచుకొంటివా, లేదా ? దాచక నిజము చెప్పుము'

'ఇచ్చెదను. పైకము రానిమ్ము'

'ప్రస్తుతము నీవద్ద పైకములేదుగా?'

'ఉన్న నెందుకీయను?'

'అది యెంతయు నాకు తెలియును. ఖరారుప్రకారము చిల్లిగవ్వ తక్కువగాకుండ వేయిరూకలు లెక్కపెట్టుము.'

'ఎప్పుడు?'

'ఇప్పుడు.'

'ఇప్పుడు నాదగ్గర పది రూకలు కూడ లేవు.'

'పురుషోత్తమరావ్! తప్పించుకొనజూడకుము. మీదు మిక్కిలి నన్నా? నీప్రాణము నా చేతిలో నున్నది.'

పురుషోత్తమరావు కనుసైగ చేసెను. మాణిక్యము సమక్షమున నిట్టిప్రసంగ మాతని నిలువున దహించుచుండెను.

'ఆర్ముఖం! ఒడలు తెలిసి మాటలాడుము. విస్తారము ప్రేలిన—పిచ్చికుక్కను కాల్చివేసినట్లు కాల్చివేసెదను!'

'తుపాకి సంపాదించితివా?' అనుచు నిర్లక్ష్యముగా ఆర్ముఖము చుట్ట నోటినుండి తీసెను.

'అవును. సంపాదించితిని. ఉపయోగములో పెట్టించకుము.'

'పిచ్చిగోవిందంపంతులు! నేనా నీకు జంకుహాడను! భయపడకుము. వేయిరూపాయలు ప్రయోగించుము. ఆ శబ్దముతో ఆర్ముఖము మాయమైపోవును.'



'లేనిచో ?'

'లేనిచో-ఎందుకు? నావస్తువు నేను తీసికొనిపోయెదను'

'నీవస్తువేమి ?'

'ఈమాణిక్యమని నీకు తెలియదా ?'

పురుషోత్తమరావు ముఖమస్తమించుచున్న సూర్య బింబము రక్తిమ వహించెను. నేత్రములు నిప్పుకణములు గ్రక్కుచుండెను.

'అర్భకుం ! తుచ్ఛుడా ! జాగ్రత్త ! అని యతడొక ప్రచండమైన కేక వేసెను.

అర్భకుడు వింత చెందిన వానివలె నిర్లక్ష్యముగా పక్కున నవ్వెను.

'పంతులు ! ఎవరిని బెదరించుచున్నావు ? అంత కేక వేసితివేల ?'

'నాకంఠములో నూపిరియుండగా నీవు మాణిక్యము నంటజాలవు.'

'కావచ్చును.' అని అర్భకుడు శాంతముగా సమాధాన మిచ్చెను.

'నీవిచటనుండి పొమ్ము. లెమ్ము. నాయింటిలో నీవింక నొకక్షణ ముండవద్దు. నడువుము.'

పురుషోత్తమరావున కింత ధైర్యమున్నదిగా ! ఏమి ? నీప్రియమిత్రుని, నీగుట్టంతయు బూసగ్రుచ్చినట్లు తెలిసిన వానిని నన్ను, విరోధిని చేసికొను సాహసుడవైతివా ?'

'నీచుడా! నీ బెదరింపుల కీక్షణమునుండియు గోవిందం పంతులు లొంగడని యెఱుగుము.

'ఇంక నా ప్రయత్నములు నేను చేసెదను. పర్యవసానము చెప్పజాలను. ముందీబాలికను విడిపింపవలసియున్నది. ఆమెను నాకు మర్యాదగా దిరిగి యిచ్చివేయుము ?'

ఓరీ ! నీవు పోయెదవా? గెంటుదునా ?

పంతులు! మాటలు మిగులకుము ! తరువాత నెత్తుటి కన్నీరు గార్చెదవుసుమా ! భద్రము.

'నీవు లేచెదవా లేదా ?' అనుచు పురుషోత్తమరావు తటాలున దుస్తులలోనుండి ఆరుగుళ్ళ చేతితుపాకి (రివాల్వరు) తీసెను. క్రోధావేశముచే నాతనిశరీర మాపాదమస్తకము కంపించుచుండెను.

ఆర్భుఖము క్షణములో గ్రహించుకొని లేచి ద్వారమును సమీపించి నిలిచెను. ఆతనికన్నులం పురుషోత్తమరావు నేత్రములలోనికిం జూచుచున్నంత వాడిగ నుండెను.

'గోవిందంపంతులు ! మన ఒడంబడిక చెల్లినది. నీకును నాకును బాకీ లేదు-అనంగా స్నేహము నిమేషములో చివరమాట లడిగి నేనిదే పోవుచున్నాను.'

'తత్క్షణమే కానిమ్ము.'

'పైకము నియ్యవా ?'

'దమ్మిడీకూడ.'

'పిల్లనీయవా ?'

'జన్మలో'

'నీతలఁ [illegible] ము.'

మహాగ్రహమున పురుషోత్తమరా వాతనివైపు చేతిలోని తుపాకి నెత్తెను. కాని ఆర్యముఖము తెప్పపాటులో వెలుపలికేగెను.

---

## మూడవ ప్రకరణము

---

### మామిడితోపు

పురుషోత్తమరావు గృహమునిడిచి ఆర్యముఖము వెలుపలికి వచ్చునప్పటికే బాగుగా గనుజీకటి పడియుండెను. దూరముననున్న మనుష్యులు కానవచ్చుటలేదు. ఆర్యముఖము విసురుగా నడచి గ్రామము దక్షిణమునకు బోవ నారంభించెను. అచిరకాలములో నాతి దూరివెలుపలికి వచ్చెను. పొలములోబడి నడచుచు నాత డింకను బోవదొడగెను. కొంతసేపటి కొక మామిడితోపు వచ్చెను. ఆచీకటిలో నది నల్లగా భయము గొల్పుచుండెను. ఆర్యముఖము నిర్లక్ష్యముగా నాతోపు ప్రవేశించెను.

అప్పటి మామిడిగున్నలక్రింద నంధకారము నివాస మేర్పఱచుకొనెను. గుమ్మటములవలె నల్లని చెట్లదృష్టి భేదింప

జాలని కటిక చీకటి. ఆర్యముఖము మెల్లగా ముందునకేగు చుండెను. ఎండుటాకులు గాని, పండుటాకులుగాని యచట లేవు. దారిపై పచ్చిక పెరిగి మృదువుగా నుండెను. అతడు నిశ్శబ్దముగా నడచి తోపునడుమకు జేరెను. అచట నెవ్వరి కొఱకో యాతడు చూచెనుగాని యాప్రాంతములో నాతని కెవ్వరును గానరాలేదు.

'తుకాజీ!' అని యాతడు కేక వేసెను.

పెద్దనగ్గు ప్రత్యుత్తరమువచ్చెను. అది నిమ్మళించిన పిమ్మట నెవరో గొంతు సవరించుకొన దొడగిరి.

'తుకాజీ ఎక్కడరా!' అని ఆర్యముఖము మరల హెచ్చరించెను.

'హు! హు—ఇక్కడరా!' అని అనతిదూరము నుండి గంభీరస్వరముతో సమాధానము వచ్చెను.

ఆర్యముఖము గొంతుసవ్వడినిబట్టి యుపక్రమించెను. ఒక మామిడి బోదెచాటున నాతనికొక చిన్న నిప్పుకణము వంటి పదార్థము కానవచ్చెను. ఆయస్పష్టపు వెలుతురులో నొక మనుజుని వికారవదనము కొలదిగ గన్పట్టుచు మాయ మగుచు నుండెను.

'తుకాజీ! ఇచ్చట జేరితివా?' అనుచు ఆర్యముఖ మా పురుషుని కెదురుగ జీకటిలో నేలపై నాసీనుడాయెను.

'అవును. రమ్ము.'

'పత్రి యున్నదా ?'

'ఈరాత్రికి పూర్తిగా నున్నది.'

'గొట్టములో మఱికొంత వేసి ఒకగుక్క యిటుదెమ్ము'

తుకాజీ కొంతగంజాయి తీసి, తృటిలో జీకటిలోనే గింజలేరి, నలిచి, గొట్టములో నుంచెను,

'ఖుదా ఎంత దూరాలోచన గలవాడు! ఈ జ్ఞానపత్రి సృష్టింపనిచో మనవంటి బైరాగులు గతియేమి?' అనుచు తుకాజీ దేవునిమహిమను గొనియాడెను.

నిజము.నిజము. దేనికైనను మంచిదని అన్నిదిగుళ్ళకు మందు నల్లమందు కూడా ఏర్పఱచెను. ఈ రెంటిసారము సేవించువారి కెఱుక.'

తుకాజీ ఆనందమున దలయూచుచు నొక నిముసము కాలము దీర్ఘముగ గుక్కపట్టెను. వెంటనే అర్ముఖము పీక నందుకొని కొండచిలువ గాలిపీల్చినట్లు మఱియొక పెద్దగుక్క పట్టెను. తుకాజీ మెల్లగా బొగవదలజొచ్చెను. అది ముక్కుపుటముల నుండి, ముఖపుగుహనుండి మబ్బులు మబ్బులుగ వెలుపలికి వచ్చెను. అర్ముఖము పీకను తిరిగి తుకాజీ కందించి ధూమము విసర్జించు చుండెను.'

ఉభయులు నంతట వంతులప్రకారము జ్ఞానపత్రిని సేవించుచు బొగవదలుచు నడుమ నడుమ దగ్గుచు నీక్రిందిరీతి

గంభీరముగా ప్రసంగింపజొచ్చిరి. తుకారాము సంభాషణ నుపక్రమించెను.

'ఆర్మూఖం! ఇక గానిమ్ము. నీవువెళ్లినపని యేమైనది?'
'తేపు గంజాయికి పైసకూడ లేదు—రాదు'

'ఆ ! దుర్మార్గుడు ! దమ్మిడియు నీయలేదా?'

'చిల్లిగవ్వకూడ'

'నీవూరకుంటివా?'

'బెదరించితిని—భయపెట్టితిని. ఏమిలాభము ?'

'గోవిందం పంతులు జంకలేదా ?'

'వాడా ! వాడేరుదాటి తెప్పగాల్ప జూచుచున్నాడు. కాని యాతెప్ప తననుగూడ దహించు ననుసంగతి యెఱుగడు—ఛండాలుడు !

'అవ్వనుగా ! వీనిపీకగోసి పీల్చనా ? గాడిద, యెంత మదించినాడు.

'పిల్ల దొరికినది—వాడు మనసు మరచినాడు. జ్ఞాపకముచేసినను లక్ష్యపెట్టలేదురా, తుకాజీ !

'సరి, సరి ఇట్లు వచ్చుచున్నాడా ? వీనిమచ్చ మాపెదను ! అన్నయ్యా ! నీవు ఆలోచనకు మొనగాడవు. చెప్పుము. నేను నీచేతిలోని చక్రమువలె నీకోరికప్రకారము తిరిగెదను'

'మొదట జరిగిన సంగతి అంతయు వినుము'

'ఇంకను విశేషములున్నవిగా ? చెప్పుచెప్పుము'

'నేను వేయిమాటలడిగినానని తనప్రియురాలికి ధైర్యం చూపుటకై వాడు చేతితుపాకి నాగుండెకు గురిపెట్టెను'

'ఊ ! అనుచు తుకాజీ భయంకరముగా పొగ వదల జొచ్చెను.

ఎట్లో తప్పించుకొంటిని. అరే, తుకాజీ, వానిని చీల్చి వేయవలెనురా'

'తయార్ ! అర్జుఖము ! ఎప్పుడు ?—'

'ఎప్పుడు ? నేటిరాత్రితాక వాడు మరల మనకు చిక్కునా ? తెల్లవారునప్పటికి గోవిందంపంతులు ఫైసల్ !'

'నేటిరాత్రియా ? వానిని నఱకుదమా, పొడుతమా?'

'పొడిచివేయుదము. లుచ్ఛా. సొమ్ము చాలయున్న దిరా? ఈయవలసినదానికే ఖిటకరించుచున్నాడు అంతయు వదలించినగాని రోగము కుదురదు.'

'ఇంక ఆలస్యమెందులకు ? బయలుదేఱుదమా?'

'బయలుదేఱుదము, కాని వానివద్దనున్న తుపాకి లాగవలెను.'

'అర్జుఖం ! ఒక్కటేమాట, తలుపులు బలవంతముగ దెఱచి ప్రవేశింతము. వెంటనే నీవో, నేనో యిద్దరము వాని మీదబడుదము. వానికి తుపాకీతీయు వ్యవధియీయవద్దు.'

'మంచిది. తుకాజీ ! నీచుఱకత్తి యున్నదా ?'

'ఎక్కడికి పోవును? కొలువులలో వేటను నఱికినట్లు నఱికుదును. వానితల మాయము చేయుదము.'

'పిల్ల నాది'

'న్యాయప్రకారము పిల్ల నీకే వచ్చును. ఆమె నాకు వద్దు.'

'సరి. ఒప్పుకొంటిని. ధనమును లెక్కచూచి పంచుకొందము.'

'దొరకినవెంటనే'

'లెమ్ము.'

'ఒకవేళ మనము పలాయనము చేయుట సంభవించిన?'

'తిరిగి యిచ్చటనే కలిసికొందము.'

'సమ్మతము'

'వీలైనంతవఱకు పని నిశ్శబ్దముగా జరుపవలెను. రెండవ కంటికికూడ దెలియనీయవద్దు.'

'సరే. జాగ్రత్తగానే పొడిచెదను.'

'దానిని పోనియగూడదు, తుకాజీ!'

'జన్మలో'

'ఇక రమ్ము. నేను దారిచూపెదను.

అర్మ్ఖమును, తుకాజీయు లేచిరి. ఇరువురు అచిరకాలములో దోపువిడిచి, కటికచీకటిలో గోవిందంపంతులు మిద్దెవైపు నడువజొచ్చిరి.

---

# నాలుగవ ప్రకరణము

## చేతి తుపాకి

మామిడితోపులో తుకాజియు నాద్మఖునును ప్రసంగించు చుండిన వేళనే పురుషోత్తమరావు మిద్దెలోని గదిలో జరుగుచున్న విషయములు విశదీకరింపవలసి యున్నది.

మాణిక్యము గోడమూలనే నిలిచియుండెను. పురుషోత్తమరావును వెనుకటిప్రదేశముననే నిలువబడియెను. కాని యిప్పుడు ఆతనిలో జిన్న ఆరుగుళ్ళతుపాకి లేదు. ఆతడు తన చేతులను వక్షముపై మడిచి, శిరమువంచి దీర్ఘముగా యోచించుచుండెను. అట్లాతడు సుమా రొక యరగంట కాలము నుండియు జింతించుచుండెను. చోటుకదలక విగ్రహమువలె నిలిచి యాతడంత తీవ్రముగా నాలోచించు విషయ మేమో యని మాణిక్యము వింత చెందెను. కాని యెంత విచారించినను ఆమెకు సమాధానము తెలియరాలేదు. పురుషోత్తమరావు చేయు యోజనాఫలమునకై యామె శాంతిముగా నిరీక్షించు చుండెను.

క్షణములు, నిమిషములు గడచిపోవుచుండెను. కాని యాతడు వంచినతల యెత్తడాయెను. ఎట్టకేలకు మాణిక్యమునకు మహానుమానము గలిగెను. ఆతడు నిద్రించుటలేదు.

గద ? నిలుచుండిరా? అసంభవము—మఱియు నాసమయమున నా? మఱి యింతసేపటినుండియు నీత డాలోచించు విషయమేమి ?

ఆకస్మికముగ మాణిక్యమునకు భయముద్భవించి శరీరము కంపింపసాగెను. అతిప్రయత్నముమీఁద నామె దాని నాపుకొనెను. పురుషోత్తమరా వెట్టి ఘోరకార్య మెంచుచుండెనో! నాఁటిరాత్రి తన మానభంగము, చావు తప్పవని ఆమె నిశ్చయించుకొనెను. కాని ఆతని జంపకుండ మాత్రము తాను చావకూడదని యామె మనసులో శపథముచేసికొనెను. ఈ ఉద్దేశముతో, దృఢనిశ్చయసూచక నేత్రములతో నామె యాతనివదనమును ఱెప్పవాల్పక గమనించుచుండెను.

ఎట్టకేలకు పురుషోత్తమరావు మెల్లగా దలపైకెత్తి తన దృష్టి మాణిక్యము వదనముపైఁ బఱపెను. ఆమె యాతని ముఖభావముల నతిసూక్ష్మముగా బరీక్షించెను. పురుషోత్తమరావు మిక్కిలి శాంతముగానుండెను. ఆతని శరీరముపై నేమియు జలించుటలేదు. ఈ శాంతభావము రాఁబోవు తుపానున కుపోద్ఘాతమని మాణిక్యము నిశ్చయించుకొనెను.

'మాణిక్యం!' అది పురుషోత్తమరావు మిక్కిలి నెమ్మదిగా నామెను సంబోధించెను.

కాని యువతి మాఱుపలుకలేదు.

'ఇది కడసారి. నాకు సమాధానము చెప్పవా?' అని యాతడు మరల నామెను హెచ్చరించెను. కంఠస్వరములో గ్రోధముగాని, మోహముగాని, కన్పట్టుటలేదు—దీన భావము, విచారము—కాక పశ్చాత్తాపము, ఈగుణము లచట మిళితమై యుండెను.

'పలుకవా?' అని యాతడు మూడవసారియు బ్రతిమాలెను.

మాణిక్యము ప్రత్యుత్తరమీయ నిశ్చయించుకొనెను. ఆతనిలోతు కనుగొనుటకు ప్రసంగమే కదా సాధనము.

'బహుశా—నిజముగా నిదియే మన మొకరినొకరు చివరసారి చూచుట, మాటలాడుట, జవాబు చెప్పవా?' అని ఆతడు నెమ్మదిగా నింకొకమారు ప్రార్థించెను.

అయిన బురుషోత్తమరావు సత్యముగాఁ బశ్చాత్తాపము చెందుచుండెనా? మాణిక్యమున కాయాశలేదు అతని నెట్లు నమ్మవచ్చును. అది యంతయు బూటకము—నక్కజిత్తులు. అయిన అన్నిటికి తెగించియున్నది కాన నామె యాతనితో సంభాషించిచూడ దలచెను. క్రమక్రమముగా నాతని నడతను గమనించుచు దానినిబట్టి తాను ప్రవర్తింపనెంచెను.

'నామనవి వినవుగా?' అని అతఁడు జాలిగానడిగెను.

'నీకేమి కావలయును?' అని మాణిక్య మెట్టకేలకుఁ బెదవులు విచ్చెను.

పురుషోత్తమరావు మిక్కిలి సంతసించి నట్లగపడెను. ఏమి కావలయునో చెప్పుదునా?'

'చెప్పుము.'

'నీప్రేమ—నీకౌగిలి—నీముద్దు!'

'నీజన్మలో పొందవు.'

'ఎందు చేతనో?'

పురుషోత్తమరావుముఖముతీరుక్రమక్రమముగా మారుచుండెను. మాణిక్యము దానిని గమనించుచుండెను.

'నీకు చెల్లెళ్ళు, అప్పలు లేరా?'

'లేరు'

'భార్య లేదా?'

'నీవు తప్ప.'

'ఛీ దుర్మార్గుడా! నీకు తల్లి లేదా?'

'లేదు.'

'నీవు పశువునకుఁ బుట్టితివా?'

'చెప్పజాలను.'

మాణిక్యమున కసహ్యాభావ మెక్కుడయ్యెను. ఆమె నాతని ప్రశ్నించుట మాని తిరస్కారమున నాతని గమనించుచుండెను. పురుషోత్తమరావు కనుల కొక్కమారుగ తేజము వచ్చెను. అవి మెఱయజొచ్చెను. మాణిక్యము దేనికైనను సిద్ధురాలై యుండెను.

'మాణిక్యం! ఈ క్షణమువరకు ఇష్టాయిష్టములు నీ చేతిలో నుంచితిని. ఇపుడు నీవు వానిని వదలుకొంటివి. కాచుకొనుము.'

'దేనికి?'

'దేనికా? చూడుము.'

అనుచు పురుషోత్తమరావు చేతి తుపాకి వెలికిదీసి కుడిచేత బట్టుకొనెను. మాణిక్యము జంక లేదు.

'నిన్ను హూనముచేసెదను. బాలికా భద్రము'

'చేయుము. అది నాకిష్టమే'

'నాకోరిక దీర్పనిచో, నిన్ను గుండెలలో కాల్చెదను, నీశవము కాలితో దన్నెదను. జాగ్రత్త!'

'అదియు నాకు సమ్మతమే'

'అరచినచో నీతల ఛిన్నాభిన్నముచేసెదను. తెలిసినదా?'

'దానికి మనస్ఫూర్తిగా ఒప్పుకొందును.'

పురుషోత్తమరావు తటాలున నామెను సమీపించి, యెడమచేతితో నామెను కౌగిలింపబోయెను. ప్రాణములకు దెగించియున్న మాణిక్యమాతని విసురుగ నొక త్రోపుత్రోసి మఱియొక గోడమూలకేగెను.

'నిన్ను పేల్చెదను. మాణిక్యం! ఖబడ్దార్! నామాట వినవా'

'తుచ్ఛుడా ! వదరకుము'

ఆతడామెను మరల సమీపించెను. ఆమె యాతని మరల ద్రోసి మరల దప్పించుకొనెను.

పురుషోత్తమరావు వామెను మూడవసారి జాయుచు దటాలున నాగెను. గది తలుపు నెవరో బలవంతముగా దెఱచిరి. గడియయూడి ఖంగుమనుచు గ్రిందబడెను. ఇరువురును విస్మయముతో జూచిరి.

'రక్షింపుడు! రక్షింపుడు!' అని మాణిక్యము కెవ్వున కేకవేసెను.

ఆర్యముఖమును తుకాజీయు దటాలున బ్రవేశించిరి.

'అడుగో! నఱకుము!' అనుచు గత్తిదూసి ఆర్యముఖము పురుషోత్తమరావు మీఁదికి లంఘించెను. కాని మధ్యమార్గముననే ధామ్మను మ్రోతతో తుపాకి ప్రేలెను.

'తుకాజీ! నన్ను చంపినాడురా! నఱకుము!' అనుచు ఆర్యముఖము కెవ్వున నఱచి క్రింద బడెను.

'గాడిదా! చావుము!' అనుచు పురుషోత్తమరావు పొగలో నదృశ్యుడయ్యెను. తుకాజీ చుఱకత్తిదూసి యాతని వెంబడించెను.

---

## ఐదవ ప్రకరణము

### మొండిప్రాణము

గదిలోని పొగవిచ్చెను. మాణిక్యము ప్రతిమవలె నొక మూల నిలిచియుండెను. నేలపై నెత్తురుమడుగులో ఆర్యముఖము

పడి గిజగిజలాడుచుండెను. అచట పురుషోత్తమరావు, తుకా జీయు లేరు. మిగిలిన వేవియు నెట్టివస్తువును వహింపలేదు. చేతనములేని గోడలు మొదలైనవి మెచ్చటివచ్చట నేయుండెను.

మాణిక్యమున కేమిచేయుటకును దోచలేదు. జరిగిన విషయముల కామె నిర్ఘాంతపడెను. కర్తవ్య మామె యూహించుకొన జాలదాయెను అనుమానముతో గొంత కాల మట్లు నిలిచి యాతరుణి ఆర్తముఖమును సమీపించెను. ఆతడు కనులు మూసికొని విలవిల దన్నుకొనుచుండెను. ఆతనిస్థితి చూచి నప్పుడు మాణిక్యము దేహము కంపించెను. ఆచోరు డనసాన కాలమున నుండెనని యామె తలచి విచారించెను. పోయి వైద్యుని నెవనినైన బిలిచిన లాభముండు నేమో ? కాని యా గ్రామనులో గ్రామవైద్య డెట్లు దొరకును ? దొరికినచో ?—ఈ దురదృష్టవంతు డిట్లు దిక్కుమాలి ప్రాణములు వదల వలసిన దేనా ?

తటాలున వంగి యామె ఆర్తముఖమును దాకెను. ఆతడు వెంటనే కన్నులు విచ్చెను. కొలదికాలము నివ్వెరపాటుతో నామెనుజూచి, తెలివి తెచ్చికొని యాత డిట్లనెను.

'నన్ను—నన్ను—రక్షింపుము ! మాణిక్యం బ్రతికింపుము !'

'ఎట్లు నేనేమి చేయను ?'

'పరుగెత్తి వైద్యుని—ఎవరైనను సరే—తెమ్ము !'

'ఎవరున్నారు ?'

'గ్రామములో త్వరగా విచారింపుము,'

'నేను తిరిగివచ్చుదాక?'

'దేవుడున్నాడు'

వెంటనే మాణిక్యము తలుపులు తెఱచుకొని వెలుపలి గాఢాంధకారములోనికి జనెను. పది నిముసములు విసురుగా నడచి యామె యొక పురుషునిగాంచెను. వెంటనే ఆమె యాగి రొజుచు, అయ్యా! మునసబుగారియిల్లెక్కడ?' అని యడిగెను.

ఆతఁడాగి యామె నెగాదిగా చూచుచు 'నీవెవరు?' అని ప్రశ్నించెను.

'అయ్యా! వ్యర్థప్రసంగమునకు వేళలేదు. దయచేసి వెంటనే చెప్పుము.'

'ఇంత తొందరలో నున్నావేమి?

'ఒక మనుష్యుఁడు చనిపోవుచున్నాడు వైద్యునిల్లు తెలిసిన చెప్పుడు మీమేలు మఱవను.'

'నీవీ గ్రామమునకు క్రొత్తదానవు. లేనిచో సన్నెఱుగుదువు—'

'మీ రెవ్వరు?'

'నేనే వైద్యుడను.'

మాణిక్యము మిక్కిలి యానందముతో, అయిన వెంటనే రండు! రండు! మనము పోవునప్పటికే కార్యము మించిపోవునేమో! రండు? అని యాపురుషుని ప్రార్థించెను.

'అయిన త్రోవచూపుము' అని యాతడు బయలు దేరెను.

ఉభయులును చకచక నడచుచు పురుషోత్తమరావు దీసికొనిన మిద్దెవైపుదారి బట్టిరి త్రోవలో మిక్కిలి క్లుప్తముగ తనచెలి, పురుషోత్తమరావు ప్రవర్తన అర్కుముఖము తుకాజీ యాతనిం జంపవచ్చుట జరిగిన విషయము లాతనికి జెప్పెను. మిక్కిలి వింత చెందుచు నాపురుషు డామెను చెచ్చెర వెంబడించుచుండెను.

వారాగతి ప్రవేశించి చూచునప్పటి కార్కుముఖము స్పృహ దప్పిపడియుండెను. ఆపురుషు డాతని సమీపించి, కూర్చుండి గాయము జాగ్రత్తగా బరీక్షింప నారంభించెను. దీపపు వెలుతురులో మాణిక్య మాతని యాకారమును దిలకించెను. వైద్యునికి సుమారు నలుబదియేండ్లు మీరి యుండెను. పొడగరి బక్కపలచగా నుండెను. గడ్డము మీసములును నున్నగా గొరిగించుకొనెను. శరీరము వన్నె చామన చాయ మెడలో బంగారముపొదిగిన యొంటిరుద్రాక్ష యుండెను.

'గాయముపాయకరమా? అని యామెయడిగెను.'

'కాదు-బాధాకరము. ఇతడు జీవించును—ఇది యుండి ప్రాణము.'

'వెంటనే చికిత్సచేయుడు. ఆలసింపవద్దు.'

'ఈతని యెడమ పక్షములో గుండెకాయకు మూడంగుళములపైన తుపాకిగుండు తగిలినది, దానిని తీయవలెను.

'చప్పున దీసివేసి యాతనికి స్పృహ గలిగింపుడు.'

'నేను ఇంటికి వెళ్ళి పరికరములు తెచ్చెదను. ఈ లోపుగ నీవీతని ముఖముపై నీరుజల్లి విసరుచుండుము.'

'సరి. కాని యీతుపాకి మ్రోతకు గ్రామములోని జను లిచ్చట గుంపుకూడరుగద?'

'నీకు రహస్య మిష్టమా?'

'అవును.'

'భయములేదు. ఈమిద్దె కొలదిదూరమున నున్నది. అదియుగాక నీవు చెప్పినట్లది యీగదిలో జరుగుటచే వెలుపలికి మిక్కిలి విశదముగా వినబడియుండదు. నాకు వినరాలేదు!'

'చిత్తము. మీరు సమయమునకు భగవంతునివలె తటస్థపడితిరి. మీ రేపనిమీద పోవుచుంటిరో!'

'ఏ శేషములు లేవు, మా మేనమామగారి యింటినుండి తిరిగి వచ్చుచుంటిని.'

'ఇక మీరు త్వరలో సాధనములు తేవలెను.'

'వెళ్ళి వెంటనే వచ్చెదను.'

వైద్యుడు నిష్క్రమించెను. నిరాశిక్యుడు ఆర్యముఖమును సమీపించి, కొంతసేపు గాయము పరిశీలించెను. అంతట నాతడు లేచిపోయి, కొంత నీరుదెచ్చి యాతని ముఖముపై జల్లి, విసనకఱ్ఱతో విసరజొచ్చెను. కొద్దిసేపటికి ఆర్యముఖుడు కన్నులు విచ్చెను.

'మాణిక్యం !'

'ఏమి ?'

'నేను బ్రతికియున్నానా ? వైద్యుడు వచ్చినాడా?'

'వచ్చి మందుకొఱకు ఇంటికి వెళ్ళినాడు నీప్రాణము నకు భయములేదు విచారించవద్దు. మిక్కిలి ధైర్యముగా నుండుము.'

'నాది మొండిప్రాణ మనినదెవ్వరు ?'

'వైద్యుడు.'

'నేను చావనని రూఢిగా జెప్పెనా.'

'మిక్కిలి నమ్మకముగా.'

'ముమ్మాటికి.'

'ముమ్మాటికి.'

ఆదుర్ముఖము నేత్రము లొక్కమారుగ బ్రకాశించెను.

'ఈసారి నేను బ్రతికిన గోవిందంపంతులు లేదు. అరే! పంతులు! నీగుండెలలో నిద్రపోయెదను.'

'ఆదుర్ముఖం! అలసి మూర్ఛపోయెదవు. ఇప్పుడు మాటాడవద్దు.'

ఆతడు మరల రెప్పలు విప్పక నిశ్చలముగా బరుండెను. నాల్గునిముసముల లోపుగ వైద్యుడు తిరిగివచ్చెను. మాణిక్య మాతని నాహ్వానమొనర్చి, నేను ఈలోగికి ప్రక్క గదిలో శయ్య సిద్ధముచేసెదను అని చెప్పెను.

చేయుము. ఈలోపుగ నేను తుపాకిగుండు తొలగించి కట్టుకట్టెదను, అని యాతడనెను.

మాణిక్య మచటినుండి నిష్క్రమించి ప్రక్కగదిలో నచిరకాలములో రోగికొక మృదుతల్పము పరిశుభ్రముగ నేర్పరచెను. వైద్యుడు కట్టుకట్టి తోడనే యామెను బిలిచెను. ఇరువురును నానుకొనగా ఆర్ముఖము మెల్లగా వచ్చి శయ్యపై కృతజ్ఞత తెలుపుచు శయనించెను. అంతట వైద్యు డామెతో నేకాంతముగ నిట్లనెను.

'అమ్మా! నీవు భోజనముచేసి యీతనికి గొలది దూరమున బరుండుము. నడుమనడుమ్మ నాతనిస్థితి నరయుచుండుము.'

'చిత్తము. మీరెప్పుడు తిరిగివచ్చెదరు?'

'రేపు ప్రొద్దున'

'ఈరాత్రి కేమియు ఫర్వాలేదుగద?'

'లేశమును'

'చిత్తము. మీరీసంగతి రెండవ చెవిలో నూదవలదని మనవి.'

'అట్లే జరిగించెదను. చూచెదవు.'

వైద్యుడు వెడలిపోయెను. మాణిక్యము వంటచేసికొని భోజనమొనర్చి ఆర్ముఖమునకు, గొంచెముదూరమున జాపపై బరుండెను. నాటిరాత్రి యామెకు నిదుర రాలేదు.

తెల్లవారులును ఆర్మ్యుఖముకలవరించుచు నేయుండెను. వానిలో నెక్కువగ 'తుకాజీ' గోవిందంపంతులు' 'మొండి ప్రాణము!' 'పంతులు ! నిన్ను మ్రింగెదను!' అని పలుమారు రుచ్చరింపఁ బడుచుండెను.

---

## ఆఱవ ప్రకరణము

### చందమామ

నాలుగు దినములు గడచెను. అర్మ్యుఖమునకు గొంత స్వస్థత చిక్కెను. ఆతఁడు శయ్యపై గోడ నానుకొని యాసీనుడు కాఁగలిగెను. గాయము మహాయుసహితము కాకుండుటచే క్రమక్రమముగా మానుచుండెను. దాసరిపల్లిలోనివారి కేరికిని ననుమానములేకుండ వైద్యుఁడు వైద్యము చేయుచుండెను ఆ మిద్దెలో పురుషోత్తమురావు పెట్టెలో రెండునూర్ల రూకలు దొరకెను. వానిలో గొలదిగ మాణిక్యము భిషగ్వరుని కీఁబోయెను. కాని యాతఁడా బహుమాన మంగీకరింపలేదు. సుస్వభావముగల యాతని యనంగీకారమునకు మాణిక్యము నొచ్చుకొనలేదు.

ఈనాలుగు దినములనుండియు నామె కొక చింత కలిగెను. తానిప్పుడు స్వేచ్ఛగానున్నది. ప్రతిక్షణమును ఆపాప కూపమును విడిచిపోయి లక్ష్మీపురములో దన జనకుఁ సమక్ష

మున వ్రాలవలెనని యామె యుద్రేకము చెందుచుండెను. కాని రోగి నొంటరిగా విడిచిపోవుట కామె కిష్టములేదు. దిక్కులేక అతడు మరణించునేమో యని యామె భయపడెను. మిక్కిలి ప్రేమగల భార్యగాని తల్లిగాని యాతనికి మాణిక్యముకంటె నెక్కువగా సపర్యసలిపియుండరు. నాలుగు దినములను ఆర్ముఖమునకు మహానందముగా గడచెను. కాని మాణిక్యమునకో! నాలుగు యుగములైన నామెకంత దీర్ఘముగా గన్పట్టియుండవు. ఏక్షణమును గృహము విడువనెంచి, ఆర్ముఖము దుస్థితిని జూచి, జాలిచెంది యాసుందరి తన యుద్యమము నతిప్రయత్నమున మానుచుండెను.

మాణిక్యము సంగతి యిట్లుండ నిక నార్ముఖము మన సెట్లుండెనో చూతము. సాధారణముగా జూదరులు, చోరులు, త్రాగుబోతులు, కఠినహృదయులు. కాని వారికి పశ్చాత్తాపముగాని, ప్రేమగాని, కృతజ్ఞతగాని యొక్కసారి గాఢముగ నాటిన వారవ్వానిని త్రోసిపుచ్చ నశక్తులై యామృదుగుణముల దాసులయ్యెదరు. ఆర్ముఖము స్థితియు నట్లే యాయెను. మాణిక్యము తనకు చేయుచుండిన మహోపకారమునుజూచి తానామె యెడల జరిపిన మహాపకారమును దలచికొని యామె క్షమాపణ నడిగి, యాతడేడ్చుచు నామె ధైర్యము చెప్పువరకు నామె పాదముల విడువలేదు. ఆమె విషయములో నాతడు పశ్చాత్తాపముచే దహింపబడుచుండెను. ఆమెయు నాతనియందు మిక్కిలి జాలివహించెను.

ఆర్ముఖ మామెను 'చందమామ' యని పిలువనొడగెను. ఏటికాతడామె నట్లు సంబోధింప నారంభించెనో యాజవ్వనికి దెలియలేదు. ఆమె యాతని నడుగలేదు. ప్రేమచే బిలుచుచుండెనని యామెకు దెలియును. తన చందమామ తనయొద్దనుండి మాయమగునేమో యని యార్ముఖము మిక్కిలి కనిపెట్టి యుండెను. చిన్నపిల్లలు ప్రియమగు నాటవస్తువులను సహితమంతకంటె నెక్కువ శ్రద్ధగా గనిపెట్టి యుండజాలరు. ప్రతినిమేషము నాతని కామెవదనము కన్పట్టు చుండవలెను. నిద్రలేచిన క్షణమే యాతనిదృష్టి యామెకొఱకై వెదకును. మాణిక్యము ముఖమున కాతని చూడ్కు లతికించినట్లాయెను. అట్టి యాలని నామె యెట్లు విడిచి పోగలదు?

మాణిక్యము కర్తవ్యమునుగూర్చి యోజించుచు జేతులలో దలచేర్చి, ఆర్ముఖము శయ్య ప్రక్కచాపపై నాసీనయై యుండెను. ఆర్ముఖ మారగా బడుండి యామె నేత్రముల జూచుచుండెను. కొంతకాలముండి యాతడు మెల్లగా నిట్లనెను.

'చందమామ! ఇప్పుడు వేళయెంత?'

'పొద్దుగ్రుంకినది-కాని నీవు నన్నేల క్రొత్త పేరు బిలుచుచున్నావు?'

'రెండుకారణములకు—ఒకటి నీ ముఖము మచ్చలేని చందమామ; రెండు నీవు నాచీకటిమాపిన చందమామవు—కాబట్టి నీవు చందమామవైతివి-తెలిసినదా!'

'తెలిసినది.'

'మఱియొకసంగతి చెప్పుదునా?'

'చెప్పుము.'

'నీవు నన్ను బ్రతికించితివి—కాదా?'

'భగవంతుడు బ్రతికించెను.'

'పోనిమ్ము నేను బ్రతికితిని—నీదయవల్ల—కాదా?'

'అవు ననుకొనుము.'

'నీకు ప్రత్యుపకారము చేసెదను.'

'ఎట్లు?'

'పగ! పగ! ఒకటి నీకొఱకు, రెండు నాకొఱకు!'

'మాణిక్యము కొట్లాడలేదు.'

'చంద్రమామా! వినుము, గోవిందంపంతులును జంపితీరెదను. లేనిచో నీమారు నేనుచచ్చితీరెదను. నీపగతీర్చెదను—నాబాకి తీర్చుకొనెదను!'

'విస్తారముగ మాటాడి ఆయాసపడుచుందువు! ఇక గొంచెము నమ్మకము చిక్కునదాక నూరకుండవుగా!'

'నాది మొండిప్రాణము, నేను చావను.'

'అయినను నీవు చేయుపని మంచిదికాదు.'

'చంద్రమామా! నాదొక మనవి. నీవీసమయమున నన్నువిడిచిపోవమానుము. ఏమంటివేని నాకెవ్వరుదిక్కులేరు. నీవే నాతల్లివి—నా చెల్లెలవు—నాప్రాణమవు. నా గాయము

బాగుగా నిమ్మళించిన పిమ్మట నేనే నిన్ను లక్ష్మీపురములో దిగవిడిచెదను.'

మాణిక్యము మూకీభావము వహించి నిజవిశాల నేత్రములతో నాతని దేటిపాఱఁజూచెను.

'నీవు నన్ను సందేహించకుము చందమామా! ఇప్పటికిని తెలిసికొనలేక పోతివా? ఆర్ముఖు డన్నమాటను తప్పువాడు కాడు.'

'గ్రహించితిని, నీవు మాటాడక పరుండినగాని నే నూరకుండను. శయనింపుము, నిద్రించుము.'

ఆర్ముఖ మా మెచకనమునైననే దృష్టినిగిడించి నిశ్శబ్దముగా బరుండెను. అతని కనేకాలోచనలు పోవుచుండెను. తుదకాతనికి గది తిరుగుచున్నట్లు తోచెను. కన్నులు క్రమ క్రమముగా మూసికొనిపోయెను, అచిర కాలములో నాతడు గాఢ నిద్ర చెందెను.

మాణిక్య మా సంగతి జాగ్రత్తగా గమనించెను. అచటి నుండి యామె నిశ్శబ్దముగ లేచి [illegible] గదిలోని కేగి యొక కలమును సిరాబుడ్డి లోనుండి [illegible] దీసెను. ప్రక్కలోనే చిన్న కాగిత మొకటి సంపాదించి [illegible] దానిమీద నేమో వ్రాసెను. పిమ్మట [illegible] యామె రోగిగదిని ప్రవేశించెను. [illegible] ఆర్ముఖుని నొక్కమారు [illegible] బలకించి కన్ని

టితో నామె యాగది విడిచిపోయెను. తరువాత కొలది కాలముననే పురుషాకారమున నామె యామిద్దె వదలి చవితి నాటి వెన్నెలలో దూర్పుగా నడువ నారంభించెను.

ఆమె నిష్క్రమించిన కొలదిసేపటి కొక పురుషు డాగది ప్రవేశించెను. ఆతడు సందడిగా వచ్చుటచే నాత్మ ఖము మేల్కొని చూచి 'తుకాజీ' అని సంతోషముతో నఱచెను.

'నేనే! నీవు జీవించియుంటివిగదా! ఖుదాకు జేపు నాలుగు కొబ్బరికాయలు గొట్టింతును.'

'ఆహా! బ్రతికియే యుంటిని. గోవిందపంతులు చిక్కెనా?'

'దొంగగాడిద తప్పించుకొనినాడు.'

'అరే బద్మాష్! కూర్చుండుము. సంగతి అంతయు జెప్పుము.'

'చెప్పెదను. ఆపిల్లయేది?'

'చందమామా!'

'చందమామ యెవరు?'

'ఆమెయే మాణిక్యము'

'ఆమాణిక్య మేది?

'ఇంటిలో లేదా?'

'నాకు గన్పడ లేదు.'

'ఆ!'

'అనుచు నారుమ్మఖము లేచి కూర్చుండెను, తుకాజీ బల్లపై చీటి చూచెను.

'ఇది యేమి ?'

'తుకాజీ! చదువుము, ఆమె వ్రాసినదేమో !'

తుకాజీ చీటి విచ్చి యిట్లు చదివెను.

'ఆరుమ్మఖం! నేను పోతినని దిగులుపడకుము. నీకుప్రాణ భయములేదు. పెట్టెలో సుమారు రెండునూర్ల ర్మూకలుగలవు. సొమ్మేమిచేయలేను! నీవొక దాసినో, వంటకత్తెనో ఏర్పఱు చుము. నేను లక్ష్మీపురం పోవుచున్నాను.

నీచెల్లెలు,

'చందమామ.'

---

## ఏడవ ప్రకరణము

### జస్వంతరావు

కనకపురమునుండి మధ్యాహ్నము మూడుగంటలవేళ బయలుదేరిన ప్రయాణీకులబండి గంటలమ్రోతతో వచ్చి శాయకూరనుప్రక్కస్టేషనులోనాగెను. శాయకూరొకమాదిరి పెద్దస్టేషను. అదియుగాక నాడచట జనులు కిటకిటలాడు

చుండిరి. సుమారు ఇన్నూ రెకరముల నాధుడగు నొక రైతు కుమారుని వివాహార్థము పెండ్లివారు తరలి యాబాలగోపాలము ముకుందపురము స్టేషను కేగుటయే దీనికి కారణము. అందుచే నచట పెండ్లివారే సుమారు నూరుగుందిని మించి యుండిరి.

రెండవతరగతి పెట్టెయందు గవాక్షమునొద్ద కూర్చొనిన యావనుఁ డొకడు పెండ్లివారి తొందర—కలవరము శాంతముగా గమనించుచుండెను. స్టేషనుమాస్టరును, గార్డును వారిని పెట్టెలలోనికి త్రోయుచు సర్దుచుండిరి. ఆడవారి కేకలును, పిల్లలయల్లరియు, పురుషుల హెచ్చరికలును, వృద్ధుల యఱపులును' గార్డుదొర వారి చీకాకును, స్టేషనుమాస్టరుగారి ముక్కోపమును, రైల్వే సేవకుల అడావిడియు, బండినడపు వారి తొందరయు, పెట్టెల మోతలును, నడుమనడుమ బసిబిడ్డల యేడ్పులును, తల్లుల లాలనయు—పలుమాటలేల? ఆప్రదర్శనము వింతగను, దర్శనీయముగ నుండెను.

ఈవేగిరపాటంతయు శాంతముగా దిలకించుచున్న యావనునికి సుమారు ముప్పది యేండ్లుండును. సుందరమైన తుమ్మెదఱెక్కలవంటి వెంద్రుకలు కనుబొమలు నున్నమీసమును. గడ్డము చక్కగా గొఱుగబడెను వదనముతీరుగంభీరముగ నుండెను. కాని యది సామాన్యముగా మందహాసమునకు దావని కన్నులు నొక్కి చెప్పుచున్నట్లు తోచును. పూర్ణముగా గనుబడని బాహువులును, వక్షము నాతడు మిక్కిలి

బలిష్టుడని స్వల్పవర్ణనమువలననే చాటుచుండెను. ఆతడు వెలగలదుస్తులు ధరించెను.

ముఖము కొలదిగమాత్రము కన్పడునట్లు ముసుగు గప్పుకొనిన యొకస్త్రీ యాపెట్టెను సమీపించి లోనికి దొంగి చూచెను. పురుషుడు ప్రప్రధమమున నామె రాకను గ్రహించలేదు. కాని యచిరకాలములోనే యాతడు మనుష్యుల జాడకట్టి యా ముసుగుకప్పుకొనిన స్త్రీవంక చూచెను. ఆస్త్రీ మాత్రము బండిలో జూచుచునేమో యోజించుచున్నట్లగ పడెను. యావనుని కామె ముఖము కన్పట్టుటలేదు.

'ఇది రెండవతరగతి అమ్మా! దీనిలో నెక్కకూడదు బండికదలువేళ యైనది. తొందరగా నింకొకదానిలో—'

స్త్రీ తటాలున నాతనివైపు తిరిగి 'జస్వంతా' అని యానంద విస్మయాతిశయసూచకమగు పెద్దకేక వేసెను.

'మాణిక్యం!, అనుచు నాపురుషు డించుమించుగా బాలిపోయినట్లు వింతచే తెల్లపోయెను. కాని మఱుక్షణములో నాతని సహజసౌందర్య మాతనికి వచ్చెను. ఆతని వదనమున నానందము తాండవమాడుచుండెను.

మాణిక్యం ! రమ్ము ! రమ్ము. ఎన్నినాళ్ళకు ! ఎన్ని యుగములకు! ముందు లోనికి రమ్ము.

ఆతడు తెప్పపాటులో దలుపు తెరచెను. ఆజవ్వని క్షణములో లోనికెక్కెను. జస్వంతరావు తలుపు మూయుచుండగనే పెద్దమ్రోతతో బండి కదలెను.

మాణిక్యము ముసుగుతీసి ప్రక్కన బాఱవైచెను. జస్వంతరావామెను నిమిషకాలము తెప్పవాల్పక చూచి తటాలున నామోహనాకారమును గాఢముగ కౌగిలించి ముద్దాడెను. మాణిక్యము నాతని యుద్రేకమునకు సమ మగు నుద్రేకముతో నాతని కౌగిటిలోని కుటికి యాతని లాలనల స్వీకరించెను. మఱి రెండు నిమిషములు వారా మహానందమున మునిగియుండిరి. వారినేత్రము లేమి సంభా షించుకొనెనో కాని, పెదవులుమాత్రము విప్పబడలేదు. అంతట వారిద్వరు నొకరొకరి కెదురుగ రెండు మెత్తని సోఫాలపై నాసీనులై సంభాషణ మొదలుపెట్టిరి. వారి చూడ్కులలోను, ప్రసంగములోను స్వాచ్ఛానురాగ మొలికి పోవుచుండెను. జస్వంతరావు చిఱునవ్వుతో సంభాషణ నుపక్ర మించెను.

'మాణిక్యం! నిజముగా నాకు నేడొక పండగసుమీ ఇంతటి మహాదృష్టమా!'

'నాకుగాదా? ఎంతటి స్వలాభపరాయణుడవు!'

'మనకనుట మఱచితివేమి?-ఇంత తలవని తలంపా? ఈ స్టేషనులోనా?—ఎనిమిది నెలలకు తరువాత—అక స్మాత్తుగ మబ్బులేని మెరపువలెను నీ విచటికెట్లు వచ్చితివి?'

'నాకథ చాలవున్నది. ఇప్పుడది తరగము. నెమ్మదిగా జెప్పెదను నీ వెచటికి టిక్కెట్టు?'

'లక్ష్మీపురమునకు, నీవో?'

'అక్కడికిగాక యింకెక్కడకు?'

'మేలు ! అన్నిటి కేమిగాని ప్రస్తుత మెక్కడనుండి రాక ?'

'ఇచటికి మూడామడలో దాసరిపల్లి యను గ్రామము గలదు. అచటినుండి బయలు దేరితిని.'

'ఆపల్లిలో నెవ్వరియింటిలో నుంటివి ?'

నన్నొక దుర్మార్గుడు చెరగొనెను. ఆకథ యంతయు నిమ్మళముగా దెల్పెదను వానిమిద్దెలో నుంటిని.

'వాని పేరు ?'

'వాని నిజమైన పేరువాడుదాచి తనను పురుషోత్తమ రావని పిలుచుకొనుచుండెను.

'దుర్మార్గుడు ! నిన్ను రాధాయమ్మ యొద్దనుండి మూడువేలకు గొనినవాడు కాడా యతడు ?

మాణిక్యము మిక్కిలి వింత చెందెను.

'జస్వంతా ! నీకెట్లు తెలియును ?'

'ఈ నడుమ విచారించితిని-అది యట్లుంచుము. వాని నిజమైన పేరేమి ?'

'గోవిందంపంతులు'

'గోవిందంపంతులు ! గోవిందంపంతులా ! నిజము గానా !'

'ముమ్మాటికిని—నీకింత యాశ్చర్యమేల ?'

'గోవిందంపంతులు! ఔరా! హంతకుడా! ఈ మారు నిజముగా నదృష్ట దేవత నన్ను కరుణించుచున్నది' పంతులు!

చిక్కితివా ? నీవిక చిక్కినట్లే !—నిన్నేమి చేసెదనో పరమాత్మునికెఱుక.'

మాణిక్యము తెల్లపోవ జొచ్చెను.

'జస్వంతా ! అదియేమి ? నీవు గోవిందపంతులు నెఱుగుదువా ?'

'ఎఱుగను.'

'మఱి.'

'పేరు మాత్రము విని యుంటిని.'

'అతడు నీకేమైన అపకారము చేసెనా ?'

'లేశమును.'

మాణిక్యము నిర్ఘాంతపోయెను.

'మఱి యీవికారమేమి ?'

'తరువాత జెప్పెదను.'

'చిత్రమే—ఆతనికిని నీకును సంబంధ మెట్లు ?'

'త్వరలో దెలిసికొనగలవు.'

'నీప్రవర్తన వింతగ నున్నది. నాకేమియు దెలియుట లేదు.'

'కొంత కాలము మాత్రమే.'

'తరువాత.'

'తరువాత నీవు విచిత్ర, అద్భుతవిషయములు తెలిసికొందువు.'

'ఎప్పుడు ?'

'నేడు తెల్లవాఱులోపుగ.'

'నేడే !'

'తప్పక.'

'అంత అద్భుతములా ?'

'మిక్కిలి. నీవు జన్మలో మరల నొక్కనిముసమున నన్నిటిని దెలిసికొనబోవు.'

'నన్ను నో రూరించుచున్నావు.'

జస్వంతరావు వంగి యామె చెక్కు ముద్దాడెను.

'పిచ్చి నాప్రాణమా ! తొందరపడకుము. నల్లని వన్నియు నీళ్ళుగావు. తెల్లని వన్నియు బాలుగావు.'

'అదేమి ?'

'తారామందిరములో నేడు కొన్ని మహాద్భుత విషయములు తెలిసికొందువు.' ఈలోపుగ—'

'ఏమి ?'

'కొలదికాలము నన్ను యోజింపనిమ్ము.'

జస్వంతరావు యోజన నారంభించెను. ద్విగుణిత విస్మయముతో నాసుందరి యాతని వదనమును జూచుచు గూర్చుండెను.

బండి విసురుగా బ్రయాణ మొనర్చుచుండెను.

# ఎనిమిదవ ప్రకరణము

## తారామందిరము

లక్ష్మీపురమునకు దూర్పున గొన్ని సుందరమైన మందిరములు గలవు. అవి పురమునకుఁ గొంత యెడముగా నుండెను. వానిలో జాతివారు నివసించుచుండక పోయినను నాభవనములు పురజనులచే 'దొర బంగళాలు' పిలువబడు చుండెను. ఇంచుమించుగా నవన్నియు మనోహరోద్యానముల నడుమనుండి రెండుగజముల యెత్తు ప్రహరీగోడలచే జుట్టబడి యుండెను. కట్టడప్రవేశమునకు ప్రహరీగోడలోని ప్రవేశ ద్వారముగడచి, గులకరాతి దిమ్మెస నేలమీదుగ, పూల తోట్టులనడుమగా బోవలసియుండెను.

ఈదొరబంగళాలో నొకటిమాత్రము మిగిలినదానికెడ ముగనుండి చక్కని పూదోటచే జుట్టబడియుండెను. ఆమంది రము మిక్కిలి సొగసైనది. 'తారా మందిరము' అని పెద్ద పెద్ద యెఱ్ఱయక్షరములతో వ్రాయబడియున్న పేరు మిక్కిలి దూరమునకు సహితము కన్పడును. ఆకట్టడముపైన తీగెలు ప్రాకించిరి. ఆ లతలు పందిరవలె నల్లుకొని వింతవింత రంగుల పూలను బూసి గృహసౌందర్యమును వృద్ధిపఱచుచుండెను.

తారామందిరమునకు ముఖద్వారము పడమటగ నుం డెను. ఆవైపున నాయుంసనుయునున పూలమొక్కలమధ్య

నున్న కొయ్యబల్లపై గూర్చుండి యొక పురుషుడును, స్త్రీ యును సంభాషించుచుండిరి. పురుషుని కేబది యేండ్లు మించిన వయసుండెను. పొడవరి. బక్కపలుచగానుండెను. శిరోజములు సగము నెఱసెను. మీసములుగాని, గడ్డముగాని, యాతడుంచుకొనలేదు. ముఖవర్చస్సునుబట్టి యౌవనమున నందకాడై యుండెనని తెలిసికొనవచ్చును. ఆతనిదుస్తులు బీదవానివిగా నుండలేదు.

ఆస్త్రీకి నలువది యేండ్లో, లేక మూడునాలుగు తక్కువో యుండును. కురులింకను నెఱియ ప్రారంభింపలేదు. సుందరమైన ముఖము. ఆమె ప్రాయము మిక్కిలి యందకత్తెయనుటకు సందేహములేదు. కన్నులలో శాంతతయు, వదనమున నొకవిధమగు విన్నదనమును, నామెరూపమునకు గ్రొత్తకళ నిచ్చుచుండెను. గంభీరస్వభావము కలదని, మితభాషిణి యని ముఖము చూచినంతనే విశదమగును. ఆమె దుస్తులు కూడ బీదరాలు వానివలె నుండలేదు.

ఏడు నెలలే పురుషుడనుచుండెను; 'రమారమియేడు నిండు నెలలే! నాభార్యయున్న యీచింతచే దప్పక మృతి చెందెడిది.'

'దినము లెంతలో గడచునండి!' ఆస్త్రీ సమాధానమిచ్చుచుండెను. 'ఎన్ని మాపులు తెల్లవారెను? ఎన్ని పగారులు ప్రొద్దుగ్రుంకెను?'

'ఏమో, లలితా! పిల్లను జూడనిది నేను నిలువలేను. మధుసూదనరావుగారితో జెప్పి యొకటి రెండు దినములలో బయలుదేఱెదను.'

'దేనికి?'

'ఇంక దేనికి—మాణిక్యమును వెదకుటకు.'

'ఈ మహాలోకములో!'

'అవును.'

'బసవరాజుగారు! ఈపిచ్చి వదలుడు. మీరు విచారభారమున నిట్లనుచున్నారు కాని—'

'ఏమి? నేను నిజముగా వెళ్ళెదను.'

'అయిన మీకు నిజముగా వెఱ్ఱిపట్టియున్నది.'

'లలితా!'

'సందేహమేమి? ఎంత పిచ్చిప్రయత్నము?'

'పిచ్చిప్రయత్నమా? ఏల?'

చెప్పెదను. మాణిక్యము నెత్తుకొనిపోయిన చోరులాబాలను జాగ్రత్తగా నీపురములోనే ఎచ్చటనో దాచిరనుకొందము. మీరు ప్రయత్నించి కనిపెట్టగలరా?

'సాధ్యము కావచ్చును.'

'అబ్బా! ఎట్లు?'

'పోలీసులసాయమున.'

'దుర్లభము. వారేగృహమును వెదకుదురు?'

'ప్రతియింట—'

'మేలు! అనగా ప్రతివారిని దోచుటకై సాగియుంటురా? ఇది గాదా వెఱ్ఱితనము! ఎవ్వరు శోధన కొప్పుకొందురు? ఎవ్వరూరకుందురు? దొంగలేనా యంత చేతగానివారు? ఎప్పటికిని పోసగదని యెఱుగుడు.'

'అవునుసుమా!'

'ఈహిందూదేశములో దీనిని మించిన వెన్ని పట్టణములు లేవు? ఇవన్నియు నెట్లు వెదకుదురు? అసంభవము. అదియుగాక—'

'ఏమి? చెప్పుము.'

'ప్రియురాలిజాడ ప్రియుడు కనిపెట్టలేకపోయిన దండ్రి కనిపెట్టగలడా? జరుగదు.'

'అవుననుకొనుము. ఈపదు నెలలనుండియు జస్వంతరావెట్టి సమాచారమును దేలేదు. తానును రాలేదు!

'వచ్చును. కొలదిదినములలో దిరిగి వచ్చుచున్నట్టినడుమ జస్వంతరావొక లేఖ వ్రాయడా?—'

'సత్యమే కొలదిదినములు గడచెను. ఆతనిజాడలేదు.'

'రెండుమూడునాళ్ళు జరుగులోపుగ వచ్చుననియే తలపవలసియున్నది. నేడె రావచ్చునని నే ననుకొందును.'

'ప్రతిక్షణము నాతనికొఱకె యెదురుచూచు చుంటిమి. ఏడీ! మధుసూదనరావుగారు చెందుచున్న దిగులునకు మేరలేదు.'

'ఆశ్చర్యమేమండి? ఆయనకు భార్యలేదు, సంతానము లేదు. ఈ సుందరిపై వారిప్రేమ పాఱెను, కన్నకూతుకంటె

గారాబముగా నాత డామెను సంవత్సరమును జూచుచుండ లేదా ?'

'లేదామతి ? లలితా ! నిజముగా మధుసూదనరావు గారి మనసు నేమనవచ్చును ? అట్టి సజ్జను డుండబోడు. మాణిక్యము మాయమగుట వారికి గొడ్డలిదెబ్బగ నుండెను. తనకన్నుల వెలుగు అదృశ్యమైనదనుచు నాయన వాపోవు చున్నాడు!'

'వాస్తవముగా నామె ప్రతివారికిని కన్నుల వెలుగే యగును. ముద్దులుమూటగట్టు ఆమెముఖమును చూచుటయే పండుగ !'

'లలితా! అయ్యో! నాపిల్ల బ్రతికిఉన్నదా ? ఉండిన నిన్నిదినము లేని తిరిగిరాక యుండును! అయ్యో ! ఆ-మెకు-'

'మీరు పిచ్చిబడకుడు. ఆమెకు ప్రాణభయములేదు. ఆమె సౌందర్యమునకై యాసుందరి నెవరో దొంగిలించిరని నా దృఢనమ్మకము.'

'పాపిష్టి సౌందర్యము ! దీనివలన బిడ్డకేమి కీడు వచ్చెనో కద ? ఏక్షణమున నేమివార్త పుట్టునో ! రామా!'

'ప్రహరీగోడలోని ద్వారమెవరో తెఱచి లోనికివచ్చి నట్లు సందడికలిగెను. వారిద్వరు నటు చూచిరి. జస్వంత రావును మాణిక్యమును జకచక నడచుచు నాతాతిబల్లను తేజోవంతములైన ముఖపద్మములతో సమీపించు చుండిరి.

'నాతల్లీ!' అనుచు సంతోషాతిశయమున బాష్పములు విడుచుచు దబాలున లేచి బసవరా జామె కెదురు వరు విడెను.

'జస్వంతరావ్! మాణిక్యం! ఆహా! నాఅదృష్టము!' అనుచు లలిత ఆనందముతో లేచి యాకాముకీ కాముకుల డాసెను.

బసవరాజు కూతును గాఢాశ్లేష మొనర్చెను జస్వంత రావు లలిత చేతిని గ్రహించి కన్నులకద్దుకొనెను.

'నాయనా! స్థితిగతు లెట్లున్నవి?' అని యామె రహస్యముగ జస్వంతరావు నడిగెను.

'ఇంతవఱకు నన్నియు సరిగానే ఉన్నవి' అని జస్వంత రావు రహస్యముగానే సమాధానము చెప్పెను.

అంతట నెల్లరును మధుసూదనరావుగారికీ శుభవార్త తెలుప తారామందిరములోనికి జనిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

### మధుసూదనరావు

తారామందిరముపై నొక రమణీయమగు గదియందు బసవరాజును, జస్వంతరావును, మాణిక్యమును నొక చక్కని శయ్యప్రక్క కుర్చీలపై గూర్చుండి యుండిరి. వంటలక్క

యగు లలిత వారికి గొలది దూరమున నొక బల్లపై నాసీన యాయెను. ఆశయ్యపై నొకపురుషుడు దుప్పటికప్పుకొని పరుండెను. ఆయనయే మధుసూదనరావుగారు. ఆయన ఎఱ్ఱని టోపీని తలమట్టును ధరించి యుండుటచే పెదవులును, నాసికయు, కనులును, కనుబొమలును, మకురొకింతయు దప్ప మిగిలిన వదనము కప్పబడియుండెను. ఆటోపీలోనుండి నయితము కొన్ని వెండ్రుకలు గడ్డముపై నిక్కబొడుచు కొనుటచే ఆయనను గడ్డము పెరిగియుండెనని యూహింప వీలగుచుండెను. మీసము లర్థనెఱపును వెలిబుచ్చు మధుసూదనరావునకు సుమారు బసవరాజు వయసుండునని చాటుచుండెను.

అచట గంభీరముతో లలితతప్ప మిగిలినవారు భాగము తీసుకొనుచుండిరి. మధుసూదనరావు మాత్రము శయనించియే ప్రసంగించుచుండెను.

'అమ్మా! నీవృత్తాంతము మాకు మొదటినుండియు బూసగ్రుచ్చినట్లు చెప్పుము.' అని మధుసూదనరావు మాణిక్యమును గోరెను.

'అది చాలా వున్నది బాబూ!' అనుచు నామె మందహాసముతో నభ్యంతరము చెప్పెను.

'ఇచ్చట నెవరికి తొందర? అంతయు చెప్పవమ్మా!' అని బసవరాజుగారు ప్రోత్సహించెను.

'మొదటినుండియు విందురా!' అని మాణిక్యము కంఠము సవరించుకొనెను.'

'అవును. ఆరంభింపుము.'

'నిన్ను తారామందిరమునుండి యెత్తుకొనిపోయిన దాది నేటివఱకు జరిగిన యేడునెలల సమాచారములు విశదముగా జెప్పుము' అని జస్వంతరావనెను.

అందఱు మిక్కిలి శ్రద్ధతో నాలకించుచుండ, మధుసూదనరావువైపు జూచుచు మాణిక్యము నిజకథ నిట్లు చెప్పదొడగెను.

'సుమారు రెనిమిది నెలలక్రిందట జస్వంతరావు తారామందిరము విడిచి, తన యుద్యమమేమో యేరితోడను జెప్పక యెచటికో బయలువెడలెను. తరువాత బదిదినములు విశేషము లేమియు జరుగలేదు. ఒకనాటి సంజవేళ నేను మన పూలతోటలో దిరుగుచుంటిని. ఆసమయమున గోడ మీదుగ వచ్చి చీటియొకటి నాముందు బూలమొక్కలలో బడెను. నేనాసమయమున తారామందిరము వెనుకనుంటిని. నేను వింతతో వంగి యాచీటిదీసి విప్పియిట్లు చదువుకొంటిని.

'మాణిక్యం! జస్వంతరావు మహాపదలో నున్నాడు: చావు తప్పదు, కాని దిగులుపడకుము. ఇంటిలో జెప్పకుము. సర్వనాశనమగును. దేవునిదయచేత నీవానిని కాపాడవచ్చును. రాత్రి యెనిమిదిగంటల క్షిప్రముగనే ఉండవలెను.'

'దస్కతు లేదా?' అని మధుసూదనరా వడిగెను.

'దుర్మార్గులు!' అనుచు జస్వంతరావు పండ్లు కొఱికెను.'

'దస్కతు లేదు. నేనా చీటిని నమ్మితిని. అనుభవము లేమి నేను మోసపోతిని. జస్వంతరావును గాపాడవలె నను నొక్క యూహ తప్ప నింకొకటి నాకు దట్టలేదు. అదియు గాక నాకంత భయము లేదు. మీతో జెప్పక నేను నాటి రాత్రి యెనిమిది గంటలకు దోటచేరితిని—'

'పిచ్చిదానా! మాతో జెప్పక యెట్టి యనర్థముల పాలయితివి?' అనుచు మధుసూదనరా వడ్డువచ్చెను.

'ఇంతకు దైవాజ్ఞ అట్లున్నది' అని బసవరాజనెను. తరువాత?

'ఏమున్నది? నేను చాలసేపు తోటలో జీకటిలో నిలువకమునుపే యెవరో తటాలున వెనుకగావచ్చినానోరు గట్టిగా మూసిరి. క్షణములో నా కాళ్ళు, చేతులు, నోరు, కళ్ళు, గట్టిగా బంధింపబడెను. భయమును మించిన విస్మయముతో నేను క్రిందబడితిని. నన్ను గోడమీదుగ నెట్లో చేరవేసి యొక బండి నెక్కించిరి. బండి రివ్వున సాగెను. నా మనసెట్లుండెనో పలుమాటలలో నేను వర్ణించుటకంటె మీ రూహించుకొనవచ్చును. జరిగిన మోసమునకు కోపముతో, భయముతో నా తెలివి లేమికి బశ్చాత్తాపముతో, రోషముతో ప్రతీకార భావముతో నేను పిచ్చియూహల నెన్నియో దారి

పొడుగునను చేయుచునే ఉంటిని. ఎట్టకేలకు బండి ఆగెను. నన్ను దించిరి. నానోటిగుడ్డలు విప్పి నాకు భోజనము పెట్ట బోయిరి. కాని నేను ముట్టలేదు. నన్ను పరుండబెట్టిరి. ఎచ్చట! నాకు దెలియదు. తెల్లవారినతరువాత నానోటికి గుడ్డలుకట్టి మరల బండిలో ప్రయాణమారంభించిరి. రాత్రి నిద్రలేమిచే నచిరకాలములోనే గాఢముగ నిద్రించితిని.

మాణిక్య మొకింతయాగి మరల ప్రారంభించెను.

'పదిమాటలేల? భోజనమువేళ కాగుచు, మరల బయలుదేఱుచు, మేము మూడు దినములు ప్రయాణము చేసితిమి. ఈలోపుగ నా బంధములు వారు విప్పలేదు. భోజన సమయమునకు నోటిగుడ్డలు మాత్రము విప్పుచు వచ్చిరి. ప్రయాణ మెప్పుడు ముగియునాయని వింతగ నుండెను. భయముమాత్రము నాకు గలుగలేదు. వారు నన్ను చంపరని నాకు ధైర్యము బాగుగా గలిగెను. ఎందు కట్లు కలిగెనో నాకు దెలియదు.

'మూడు దినములకు పిమ్మట మాబండి యాగెను. నన్ను దింపిరి. ఎవరో సాయముచేయగా నేనొకగృహముప్రవే శించి కొన్ని మెట్లెక్కదొడగితిని. నేనొకగది ప్రవేశించినట్లు తెలిసికొంటిని. అచట నాబంధము లన్నియు విప్పబడెను. మూడుదినములకు దరువాత నేను కండ్లుతెరచి చూచితిని. అదియొక విశాలమగు గది. ఒకటే తలుపు ఉన్న రెండుచిన్న కిటికీలును మిక్కిలి యెత్తుగానుండెను. గదిలో శయ్యయు,

చూచునో—ఆ మఱుక్షణమే యది నా ప్రాణశోషము సహితము ద్రావును. తెలిసినదా ? .

తెలిసినది. అని భయపడుచు నామె మెల్లగా సమాధాన మిచ్చెను.

మంచిది—ఇక వేఱుసంగతు లేల ? గెలిచినను, ఓడినను నేడు తెల్లవాఱు నప్పటికి శ్రీధరు డీ లోకములో నుండడు—అనగా నాతని యాత్మ యని నా అభిప్రాయము. మీాద నీగతియేమి ?

ఇట్టి దారుణమైన ఆలోచన నీకేల గలిగినది ?

ఏది !

గెలిచినను ఆత్మహత్య చేసికొనవలెనను గట్టిపట్టుదల

మరల మరల నన్నడుగవద్దు. ఒకమారే చెప్పుచున్నాను. నాకీ జీవితముపై విసుగు జనించినది. బాగుగా గ్రహించుకొంటివా ?

గ్రహించుకొంటిని.

ఒక్కమారే — చివరసారి — అడుగుచున్నాను. మీాద నీగతియేమి ?

నీకెందుకు ? నీదారి నీది. నాదారి నాది.

అదెట్లు ?

అనగా ?

చంద్రం ! నీదారి నీది యనగా నాకర్థము కాలేదు. నీ యభిప్రాయ మేమి ?

నీకనవసరము గదా?

పిచ్చిదానా! ఎన్నటికినిగాదు. నాకు చాల అవసరము

ఔనా? ఎట్లో?

నేను నిశ్చింతగా నెట్లు చనిపోవలయు?

నేననిన నీకు దృణప్రాయమైనపుడు నా భవిష్యత్తుతో నీకేమిపని?

అటుగాదు. నీవు నన్ననుసరించుకొని పగటిచుక్కను విడిచివచ్చితివి. కాబట్టి నీపూచీ నాకు దప్పదు.

అట్టయిన నీవేల చావనిశ్చయించుకొంటివి?

నన్నాప్రశ్న అడుగవద్దంటిని.

అనగా నీమీద ఆధారపడి నేనున్నప్పుడని నా అభిప్రాయము?

మంచిది. చెప్పుదునా? నీకు ధైర్యముకలదా?

చంద్రం పగటిచుక్క ప్రియురా లనుట మఱపకుము!

మఱవలేదు. మఱవను. క్రియలో జూడవలసి యున్నది. చూడవచ్చును.

అయిన. చంద్రం! నీ కొఱకదారి యేర్పఱచియే యున్నాను సుమా?

తెలిపిన సంతోషింతును.

చెప్పెదనుకాని నిన్ను ముస్ముందుగ గొన్ని ప్రశ్నలడిగెదను.

అడుగవచ్చును.

పగటిచుక్కను విడిచితివి—మరల నాతని జేరవలె నని యుద్దేశము కలదా?

జన్మలో లేదు. ఉండదు.

సరి. నే చనిపోయినట్లే యెంచుకొనుము. ఏమి?

అట్లే.

మేముతప్ప నీయం దభిమానముగలవా రెవ్వరున్నారు?

ఎవ్వరును లేరు.

నీవిక జీవించి యేమిలాభము?

చంద్రము ప్రత్యుత్తరమీయలేదు. ఆమె శాంతముగా యోజింప జొచ్చెను. కొలదికాల మున్నతరువాత శ్రీధరరావు మరల నిట్లనెను.

బ్రతుకవలెనని యిచ్ఛగలదా?

లేదు, అని యామె దృఢముగా జెప్పెను.

శ్రీధరరావు సంతోషించిన ట్లగుపడెను. 'మంచిది. ఇక నేను నీ కేర్పరచిన దారి చెప్పుదునా?

చెప్పుము.

మనస్ఫూర్తిగా అవలంబింతువా?

మనస్ఫూర్తిగా.

పగటిచుక్కను మనము చంపవలెనని యెంచితిమి. దేనిమూలమున?

విషపుచుక్కలచే.

ఆవిషమింకను నాయొద్దనున్నది ఉపయోగింతువా ?

నీయిష్టమైన.

నాకిష్టము కనుకనే చెప్పుచున్నాను.

తప్పక యుపయోగింతును.

స్త్రీ సాహసమునందు ప్రచండవైరాగ్య మున్నది. చంద్రము పై వాక్యము మిక్కిలి శాంతముగా వచించెను. వాక్యము చిన్నదే. దానియం దఖండార్థముండెను. శ్రీధర రావు దానిని గ్రహించెను. అంత త్వరగా చంద్రమట్టి ఘోర నిశ్చయమునకు నెట్లు వచ్చెనోయని యాతనికి వింతజనించెను. ఆత డిట్లనెను.

బాగుగా ఆలోచించుకొనుము.

పరిపూర్ణముగా యోజించితిని.

అయినను మరల విశదీకరించెదను. పగటిచుక్క నీ గర్భశత్రుడు. శ్రీధరుడు మృతుడు. చంద్రముజన్మ నిరర్థకము కావున నామె మరణము నిశ్చయించుకొనినది. అందులో— మిక్కిలి త్వరగా జచ్చునుపాయ మున్నది. ఆమె దాని నవ లంబింప బోవుచున్నది సరేనా ?

తథాస్తు.

నేటిరాత్రియే—ఇప్పుడే ! దేనికనగా — శ్రీధరుడు నిర్మలహృదయముతో మరణించుటకొఱకు అవునా ?

నిజము.

చంద్రం! అయిన ఒకగ్లాసునిండ నీళ్ళు తీసికొనిరమ్ము.

మాఱుమాటాడక చంద్రము వెంటనే యొకగ్లాసు నిండ మంచినీరము దెచ్చి యాతనిముందు బెట్టెను.

విషము కలుపుదునా ?

సంశయింపక.

శ్రీధరుడు బుడ్డితీసి సగమునీటిలో బోసెను. ఆద్రావకము నీటిలోలీనమైపోయెను. మిగిలినదానిలో గొంత చుఱకత్తిచివరబూసి శ్రీధరుడు బుడ్డి దాచెను. అంతట నతడామెతో నిట్లనెను.

చంద్రం! మృత్యువు నిన్ను క్షణములో దన సన్నిధికి దీసికొనెను. నేను దానివిషయము అవసరమైన నా కుప యోగించును. పుచ్చుకొనెదవా ?

'ఆ' అనుచు చంద్రము నీటిపాత్ర పైకెత్తెను.

ఆగుము ఆగుము! అనుచు శ్రీధరుడామెచేతిని బట్టుకొనెను. ఆతని కన్నులవెంట బాష్పములు ధారలుగట్టెను. 'ఓపిచ్చిచంద్రం! నాప్రాణమా! నన్నెట్టి యవస్థకు దెచ్చితివి! నీవెట్టి యవస్థపాలైతివి! మన యిర్వురిజన్మలు నాశన మొనర్చితివి. నీచావు కనులార జూడలేను. జన్మలో జూడజాలను!

శ్రీధరా! నీవు నిశ్చింతంగా జావగోరితివి. నన్నుకూడ నిశ్చింతగా జావనీయవా !

నిరభ్యంతరముగ—

అయిన వెనుకటి దుశ్చరితము లుచ్చరింపకుము—అది పెద్ద యగాధము—అది యటుండనిమ్ము. నేను దేవుని ప్రార్థించుకొని యీనీరు త్రావెదను!

మంచిది. ముఖముపై చేతిరుమాలు గట్టెదను.

దీపము నా కాలుదగ్గఱ పెట్టెదను. నీవునాకొక గుర్తు చెప్పుము దీపము తన్ని నేను నాయుద్యమముమీాదజనెదను.

మంచిది. నేను మనసులో బ్రార్థించుకొని బిగ్గఱగా 'తథాస్తు!' అనెదను. వెంటనే నీరు పుచ్చుకొనెదను—అనగా కాలకూటవిషము. అదేగుర్తు.

శ్రీధరరావు చుఱకత్తి బట్టుకొని లేచి దీపము కాలుముందుబెట్టి చంద్రముని కెదురుగ నిలచెను. చంద్రం తనంతటనే పెద్ద చేతిరుమాలు ముఖముపైగట్టుకొనెను. అంతయు సిద్ధమాయెను.

ప్రార్థించుకొనుము.

మొదలుపెట్టుచున్నాను. నీవు సిద్ధముగా నుండుము. గుర్తు 'తథాస్తు'

జ్ఞాపకమున్నది.

చంద్రము ఏమో అయిదు నిముషములకాలము గొణుగుకొనెను. శ్రీధరుడు ప్రతిమవలె నట్లే నిలిచియుండెను.

ఎట్టకేలకు 'తథాస్తు!' అని చంద్రంనోటినుండి స్ఫుటముగ వినవచ్చెను.

మఱుక్షణములో నామె యానీటిని గుటగుట ద్రావివైచెను.

దేవుడా! మా నేరముల క్షమింపుము! క్షమింపుము! అనుచు శ్రీధరుడు దిమ్మెను ఫడేలున దన్నెను.

ఆదీప మారి గోడకు టక్కున గొట్టుకొనెను.

ఇల్లంతయు క్షణములో గాఢాంధకారము!

శ్రీధరుడు చక చక యింటివెలుపలికివచ్చి తలుపువైవ బోవుచుండెను ఆ సమయమున సరిగా నింటిలో నేలపై నేదియో తటాలున బడినట్లు పెద్దచప్పు డాయెను.

ఈశ్వరా! ఆ సుందరి ఆత్మను శాంతముగా గొనుము-శాంతముగా శాంతముగా — శాంతముగా! అనుచు శ్రీధరుడు కవాటము వేసెను.

మఱునిమిషములో నాతెసియాకారమావీధి చీకటిలో లయమైపోయెను.

---

ఇరువదియెనిమిదవ ప్రకరణము

మఱునటిరాత్రి 2

రాధాయమ్మ మేడకు వెనుకభాగమున నొక చిన్న సందుగలదని వెనుకజెప్పియుంటిమి. ఆసందు గడచియే రామరాజు మేడలోనికి శ్రీముఖిని జూచుటకు వచ్చుచుండెడివాడు.

దానిలోనే యొకనాటిరాత్రి శ్రీధరుడు రామరాజును హత్య చేయప్రయత్నించెను. రామరాజు తని నొక వేపచెట్టునకు బంధించినట్లు మనకు దెలియును. ఆచెట్టాసందు చివరనుండెను. అచ్చటనే చంద్రమువచ్చి శ్రీధరుని విడిచిపుచ్చెను. ఆ సందు లోనికి మరల జదువరులను నేటిరాత్రి ప్రవేశపెట్టు చున్నారము.

రాత్రి పదిగంటలాయెను. గోవిందంపంతులాసందులో నిలిచి యొక పురుషునితో గుసగుసలాడుచుండెను. ఆ పురుషుడు శ్రీధరరావు ఆసందు బ్రవేశించినవెంటనే యచట దాను యత్నించిన హత్యయు— బద్యానపానమును — చంద్రము తనను విడిచిపుచ్చుటయు నాతని కొక్కమారుగ జ్ఞప్తికి వచ్చెను. ఇప్పుడు చంద్రం—భువనైకసుందరి— యేమైనది ? బావురుమనుచున్న యీ సందులోని కటికచీకటి యామెను దన పొట్టను బెట్టుకొనినట్లు శ్రీధరరావునకు దోచెను. ఆమె యుదార స్వభావమున కాతనికి మెప్పు వచ్చెను—తా నొనర్చిన పనికి ఘనపశ్చాత్తాపము గలిగెను. తనను సర్వస్వముగ నమ్ముకొనిన యీసుందరి గొంతు తాను కర్కశముగా కత్తిరించెను. ఆమెను నిరాశపాలు చేసెను. తన మానముచే నామెను మిక్కిలి సంతాప పెట్టెను......

శ్రీధరు డొకగోడకు జేరగిలి కన్నీరు గార్చుచుండెను. అతని హృదయమిట్లు పలవించుచుండెను. ఓనిర్మల తేజమా !

నేటిరాత్రి నీ వీగాఢాంధకారములో లీనమైపోతివా? నాకన్నుల వెలుగు నీలో లయమై, నీతో నశించెనుగదా? ఇక నేనంధుడను. ఈ మహాలోకములో నిస్సహాయుడను. ఏకాకిని, ఓపుష్పరాజమా! నాహృదయపీఠము నలంకరింపక, నన్నలరింపక, యింకొకని కేల సుఖమిచ్చితివి! నీమాధుర్యమితరుల పాలొనర్చి నీకంటకముల నామనసున గ్రుచ్చిపోతివా! చంద్రం చంద్రం! ఎంత పనిచేసితివి! నవయౌవనచకోరకము నెట్లు ముగ్గలో గ్రుంచివైచితివి! భావిసౌఖ్యాంకురము నెట్లు నిర్మూలించితివి! ఎంత తెగువచేసితివి!—స్త్రీహృదయము అనంతవినీలమహాసముద్రముకంటెను. లోతనిపించితివే! ఒక్కపనితో మన ప్రాణనాళముల విషపూరితముల జేసితివే! జీవితము కటువనిపించితివే!

ఒక చల్లనిహస్తము శ్రీధరుని భుజముపై దాకెను. ఉలికిపడి యాతడు ప్రక్కకు తిరిగెను. అచట నొక యున్నతాకారము నిలిచియుండెను. తేజము ముందరి తిమిరమువలె శ్రీధరుని యాలోచనలన్నియు జెల్లాచెదరై పోయెను. ఆతని హృదయము నావరించియున్న యంధకారము నశించెను. ఒక్కటే వెలుగు అచట ముందు దొడగెను. అదియే పగ—పగ. ఎవరిపై? ఈజ్వాల యెవ్వరిని దహింపవలెను? ఎవ్వరిని భస్మీభూతము చేయవలెను? పగటిచుక్క—తరువాత స్పష్టించిన లనను!

పురుషోత్తమరావా! అని శ్రీధరు డావ్యక్తిని సంబోధించెను.

అవును. అని గోవిందంపంతులు చెప్పెను.

లోనికి వెళ్ళుటకు ?

నా అభ్యంతరము లేదు.

దారితీయుము.

పురుషోత్తమరావు ప్రహరీగోడలోని ద్వారము నిశ్శబ్దముగ దెఱచెను. 'రమ్ము త్వరగా' అని యాతడు తోట ప్రవేశించెను. శ్రీధరరావు లోనికేగి, కవాటములోన బంధించెను. ఇరువురు మేడకు సమీపించిరి.

విరోధికొఱకు మన మెచ్చట పొంచుదము? అని శ్రీధరు డడిగెను.

మనమనెదవేమి? నేనుకూడ నుండనా?

అవసరము లేదు. నేనెచ్చట పొంచను?

యుక్తప్రదేశము నీవే వెతుకుకొనుము.

నీవు సలహా చెప్పుము.

అయిన మేడలోపైన నాగదిలోనున్న మంచిదని నేనను కొనెదను.

పగటిచుక్క అచటికి వచ్చునని నమ్మెదవా.

తప్పక అని గోవిందంపంతులు చెప్పెను.

అయిన నచ్చటికే దారితీయుము.

పురుషోత్తమరావు దారితీసెను. మేడ క్రిందిభాగము గడచి వారుపైకెక్కిరి. క్రింది నిశ్శబ్దముగ నుండెను,

రాధాయమ్మ మొకలైనవారు అప్పుడే నిద్రించిరి. మేడపైన నొకగది ప్రవేశించిరి. అది విశాలముగనుండెను.

ఇది నీగదియా? అని శ్రీధరరావు అడిగెను.

ఔను.

ఇచ్చటికేకదా పగటిచుక్క వత్తునని బెదరించినది.

నిజము—నేనిక నిచటనుండను. ఇవిగో నాదుస్తులు. చురకత్తి నీయొద్దనే యున్నదికదా?

ఉన్నది.

ఈ దుస్తులు ధరించి సిద్ధమైయుండుము. నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక!

భగవంతుని యిష్టానుసారము జరుగును.

పురుషోత్తమరావు నిష్క్రమించెను. ఆతడు క్రింద నొకగది చేరి, తలుపు దిట్టముగా బంధించి, యొకశయ్యపై గూర్చుండి చెవులు నిక్కించి, జరుగబోవు భయంకర విషయములకు వేచియుండెను.

శ్రీధరరావు పురుషోత్తమరావు దుస్తుల ధరించెను. దీపముతగ్గించి యాతడు శాంతముగా ఎక్కోలకు వేచియుండెను అకను వెలుతురులో నాతడు నిజముగా పురుషోత్తమరావువలె గన్పట్టుచుండెను. గదితలుపు దగ్గఱగ వేయబడియుండెను. పురుషోత్తమరావు వెళ్లుచున్నప్పుడు దానినట్లుచేసిపోయెను. శ్రీధరరావు దానిని బంధింపలేదు—బంధింపలచుకొనలేదు. చురకత్తి పిడికిట గట్టిగా బట్టుకొని

యాతడు దానిని తనప్రశ్నకే సిద్ధముగనుండెను. క్షణమున నెవరైన గదిప్రవేశించిన—వారెవరో చూడక పూర్వమే— ఆతడు వారిపైబడి ముక్కలు ముక్కలుగ నఱకుస్థితిలో నుండెను.

పగయనునది పాపిష్ఠిది. అది హృదయములోఁ జేర కూడదు. ఒకసారి దానికచట స్థావరమేర్పడిన తరువాత దానిని వెడలత్రోలుట దుర్ఘటము. ముఖ్యపట్టణము జే జిక్కిన విరోధి రాజువలె నది హృదయపీఠమునుండి రక్త నాళముల నన్నిటి నేలుచు శరీరమును గడ గడ వడకించు చుండును. ఆయావేగమునకు మనసు నిలువఁజాలదు. ఆయు ద్రేకమును దేహము భరింపఁజాలదు. అయదరిపాటునకు మే ధస్సు సహింపలేదు. అడ్డము వచ్చినవారిని మ్రింగివేయ వలయు నన్నంతయాతురత జనించును— నిత్యము నొకే జపము— పగ! పగ! పగ!

శ్రీధరుడు చెవులు ఱిక్కించి వినుచుండెను. సుమా రొకయరగంటదాటెను, శ్రీధరుని మనసు వశము తప్పిపోవు నట్లుండెను. ఎవరినో యొకరిని పొడుచుదనుక నాతనికి దోచునట్లు లేదు ఆతడు విసుగుతో లేచి మెల్లగా దలుపు సమీపించెను. చుఱకత్తి యాతని కుడిచేతియందు గట్టిగా నమరియుండెను. ఆతని ప్రాణ మంతయు నిప్పట్టున దానిలో నుండెను. శ్రీధరుడు మెల్లగా—నిశ్శబ్దముగా దలుపు దెఱ చెను. మెట్లపై చీకటిగా నుండెను. ఆతడు దృష్టిసారించి చూచెను, కటికచీకటి.

'గయాపహార్! అని పెద్దపెట్టున కేకవేసి యెవరో యాతని గుండెలలో కత్తితో బొడిచిరి. ఆకత్తి మెఱపువలే తళుక్కున మెఱసెను.

శ్రీధరరావు నివ్వెరపోయెను. ఆతనిగుండె జల్లుమనెను మఱుక్షణములో కత్తిపోటాతని మేల్కొలిపెను. 'అరే లుచ్ఛా! నేటితో ఫైసల్? అని భయంకర సింహనాదము చేసి యాతడు తనవిరోధిని వక్షములో చుఱకత్తి పిడికిటి వఱకు పొడిచెను.

'హంతకుడా! గోవిందం—పం—తు—లు—నన్ను చంపితివిరా—అరే' అనుచు శ్రీధరుడు పొడిచిన ఆదుర్ముఖము మేడమెట్లపై దభాలున గూలి విలవిలనాడ జొచ్చెను.

శ్రీధరుని నేత్రములలో తేజము నశించిపోయెను. ఆకంఠస్వర మెవ్వరిది? పగటిచుక్కది కాదు, మఱి శ్రీధరుడు గదిలోనికి దీపముకొఱకు రెండడుగులు వైచెను. ఆతనిపాదములు వడకెను. శరీరము తూలెను—కన్నులు తిరిగెను—మొదలునఱకిన వృక్షమువలె నాతడు గదిలో జాపపై బడెను.

కాని ఆతని తెలివి తప్పిపోలేదు. చచ్చుటనిశ్చయమని యాతడెంచుకొనెను. తానెవ్వరిని హత్యచేసెను? తన్నెవ్వరు చంపిరి? ఆభయంకరసమయమున నాతనికి చంద్రము జ్ఞప్తికి వచ్చెను. చంద్రవెట్లు చచ్చినది?—తనవిషము త్రాగి—చావునకు ముందు? భగవంతుని ప్రార్థించినది. తానో?

*

శ్రీధరుడు బలవంతముగ తన యంగరకాలోనుండి విషపుసీసాతీసెను. అది యాతనినోటికి జేరుటయెట్లు? తనచేయి స్వాధీనము తప్పిపోవుచుండెను. తప్పిపోయెను. అయినను తుదియత్నమొక్కటి యాతడు చేసెను. లాభములేదు. సీసా చేతిలోనుండి క్రిందబడెను. ఆసంగతి యాతనికి దెలిసినదో లేదో! ఆతని కన్నులు మూసికొనిపోయెను. నోట నురుగులు వచ్చెను. "సీ—సా—ప—క్క—దు—" ఏమో! ఏమో! ఆతడు పలవరించెను. మాట క్రమ క్రమముగా బడిపోయెను—ముఖము నల్లబాఱెను—రుధిరము కారుట యాగెను—శ్వాసనిలిచెను. ఆగదిలో నాతని శవము మిగిలెను.

మఱి పదినిమిషములకు దివ్వెపట్టుకొని రామరాజును—ఆతని కిరుప్రక్కలను పగటిచుక్కయు గోవిందపంతులును మేడపైకివచ్చిరి. వారు మెట్లన్నియు నెక్కుచువచ్చినప్పుడు తుదిదానిపై అర్జునుని శవము పడియుండెను. ఆతనిముఖము బొగ్గునలుపుగానుండి నెట్టిధీరునైన గుండె దడదడ లాడింపజాలియుండెను. అచ్చటి రెండుమెట్లపైనను—గదిగడప ముందునను నెత్తురు కన్నులు మిరుమిట్లు గొలుపుచుండెను. గదితలుపు తెఱచియుండెను. లోపల శ్రీధరుడు నిల్వున బడియుండెను. ఆతని హృదయములో నొకకత్తి—అర్జునుని గుండెలలో నొకకత్తి—రెండింటి పిడికిళ్ళు భయంకరముగా గన్పట్టుచుండెను. శ్రీధరునిచుట్టు నెత్తుటిమయము!

రెండు శవములు! పదినిమిషములలో! రెండు నొక దాని కొకటి నాలుగడుగులదూరములో నుండెను. ఆఘోర నాటకము పన్నుగడ ప్రకారము జరిగినది. పగటిచుక్క ప్రచండోపాయము నెఱవేరినది. ఆ భయంకర ప్రదర్శన మును జూచినప్పుడు గోవిందంపంతు లా పాదమస్తకమును వడకెను. పగటిచుక్క తలచుకొనిన—తను మూడవశవమై యుండును!

వారి యోజనల ప్రకారము! పాపము! శ్రీధరుడు పురుషోత్తమరావు దుస్తులను—ఆర్ముఖము పగటిచుక్క వేషమును ధరించియుండెను. కాని వారి కా మాయవేషము లగత్యము లేకపోయెను. ఒకరికి దెలియకుండ నొకరిని వా రొండొరులు జంపికొనిరి. ఆర్ముఖమనుకొనినట్లుగ పురు షోత్తమరావు నిద్రించుచుండలేదు. శ్రీధరుడూహించిన రీతి పగటిచుక్క డంబముగా గది బ్రవేశింపలేదు.

పాతకులు పాతకులు నిట్లొండొరుల నాశన మొనర్చు కొందురు గాక! అని పగటిచుక్క శాంతముగాను. గంభీ రముగాను నుచ్చరించెను.

"తథాస్తు!" అని రామరా జనెను.

క్రూరులు క్రౌర్యమున కెరయగుదురుగాక.

తథాస్తు.

సాధువులు శాంతిసురక్షణము నొందుదురు గాక.

తథాస్తు.

పగటిచుక్క తన సహచరులకు సంజ్ఞచేసి మేడ దిగి పోయెను. అచట వారుముగ్గురు నొకగదిలో జేరిరి.

కర్తవ్యమేమి? అని గోవిందంపంతులు భయపడుచు నడిగెను.

ఏమున్నది? పగటిచుక్క సమాధానము చెప్పెను. "ఆశవముల దొలగించి మేడ పరిశుభ్రపరుపవలెను?'

ఔను అని పంతులు తలయూచెను.

నాభటు లింకొక గంటసేపుగ వచ్చి తోటలో గోయి త్రవ్వి, దానిలో శవముల బాతిపెట్టి మేడకరిగెదరు. ఈ పను లన్నియు బూర్తియగువఱకు నీవు రాధాయమ్మ వారియొద్ద కేగి మాటలమధ్యపెట్టి, వారి నీ సంగతి యేమఱజేయుము. ఆ కేకలను వారు వినియుందురు. దానికేవో రెండు మాయ మాటలు సమాధానము చెప్పుము.

సరే.

మేముపోయి భటుల బంపెదము.

తప్పక నంపవలెను—లేకపోయిన—

నేను మాటతప్పని పగటిచుక్కను! అని సింహా చలము గంభీరముగా జవాబిచ్చెను.

గోవిందంపంతులు మాఱుపల్కలేదు పగటిచుక్కయు రామరాజు వెనకేగిరి.

భటులు వచ్చుచుందురు. సమయము మరల జిక్కునట్లు లేదు. అని రామరాజనెను.

ఔను, మనమిప్పుడు చంద్రముసంగతి పరామర్శ చేయవలెను.

ఆమె నీదురాత్మ్య మేమియు జేసియుండదుకదా?

భగవంతుని కెఱుక—రమ్ము.

పగటిచుక్కయు, రామరాజును శ్రీధరు డద్దెకు దీసికొనిన పెంకుటింటివైపు దారిపట్టి యాచీకటిలో జకచక నడచి పోవదొడగిరి.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

### మఱునటి రాత్రి 3

అర్థరాత్రము సమీపించుచుండెను. గర్తపురవువీధు లన్నియు నిర్మానుష్యమై యుండెను. చీకటిని, నిశ్శబ్దమునకును బ్రబలస్నేహము. ఈరెండును గలిసి యెట్టి దృఢహృదయుమునైన గడగడ వడకింప జాలియుండును. శ్మశానముల యందు రాజ్యము చేయునవి యివియే! పాడుపడిగృహముల నేలునవియు నివియే? కొండగుహల బరిపాలించునవియు నివియే. ఈద్వయమునకు మనుజులపొడయునిన గిట్టదు. దీపములచే దనను ద్రోలివేయుదురని చీకటికి గోపము, సందడిచే దనను భంగము కావింతురని నిశ్శబ్దమునకు—పగ—

అందుచేత నే యవి రెండుజనసంచారములవీడినిర్జనప్రదేశముల వసించుచుండును. అయినను—ఇంత్రమాత్రంబున దాము మనుష్యులకు లోబడి నట్లొప్పుకొనక యవి రాత్రుల—వీలైనంతవఱకు నిర్భయముగా బురములలోనే వాసము లేర్పఱచు కొనును—

కథాభాగమునకు దిరిగివచ్చెదము. పగటిచుక్కయు, రామరాజును సందుగొందులు గడచి శ్రీధరుని పెంకుటింటిని సమీపించిరి. ఆ చీకటిలో నల్లని ముద్దవలెనుండి యది భయము గొల్పుచుండెను. అంత యంధకారములో సహితము పాడుపడిన కళ దానిముఖమున నచ్చొత్తినట్లుండెను.

పగటిచుక్క తలుపును సమీపించెను.

వెలుపల వేసియున్నదేమో చూడుము అని రామరాజనెను,

పగటిచుక్క తడివిచూచెను. తలుపువెలుపల గొళ్ళెము పెట్టబడియుండెను.

వెలుపలనే వేసియున్నదిసుమా! అని యాతడు స్నేహితునితో ననెను.

తాళమా?

కాదు—గొళ్ళెము.

తీయుము..

శకునము మంచిదికాదు. చంద్రము యింటిలో నున్నదా?

ఏమో.

పగటిచుక్క గొళ్ళెముతీసెను. అది ఖంగుమని విపరీతముగ మ్రోగెను.

సింహాచలం! లోనికి వెళ్ళవద్దు. ఆమెపేర బిలువుము అని రామరాజనెను.

సింహాచలము మెల్లగా చంద్రం! అని పిలిచెను.

ప్రత్యుత్తరము రాలేదు.

చంద్రం !—చంద్రం!—చం-ద్రం! అని యొకమారు కంటెనొకమారు హెచ్చుగా సింహాచలము పిలిచెను.

నిరుత్తరము.

మన మనుకొనిన ట్లింటిలో లేదేమో! అని రామరాజు సందేహించెను.

మఱియొకమారు పిలిచెను—తలుపుతట్టి.

పిలువుము.

చంద్రం! చం—ద్రం! అనుచు సింహాచలము దట్టబోయెను.

కవాటపురెక్కలు కిర్రుమని లోనికి దెఱచుకొనెను?
ఇల్లు చీకటిలో బావురుమనుచుండెను.

ఇంకొక్కమారు యత్నింపనిమ్ము. అనుచు పగటిచుక్క చంద్రం! చంద్రం! అని బిగ్గఱగా హెచ్చరించెను.

ఆ భయంకర నిశ్శబ్దమే భయంకర ప్రత్యుత్తరము.
ఆ కటికచీకటియే కటిక సమాధానము.

శ్రీధరు డామెను హత్యచేసెనేమో! దుర్మార్గుడు! అని రామరా జనెను.

ఏమో—దీపములేదుకదా ?

నే తెచ్చెద నుందుము,

దీపస్తంభములోనిదా ?

ఔను.

త్వరగా దీసికొనిరమ్ము.

రామరాజు నిష్క్రమించెను. పగటిచుక్క వాకిటి ముందు నిలిచెను. తలుపు లోరగా దెఱువబడియుండెను. ఇంటిలో నేమున్నది? చీకటి చెప్పరాదు. దానికి మనుష్యునితో బద్ధవైరము. పగటిచుక్క యెవ్వరి నడుగగలడు? దీపమువచ్చిన వెంటనే యెట్టిఘోరములు బయలువెడలునో—ఏభయంకర ప్రదర్శనము కన్నులకు గోచరమగునో? చంద్రమేమైనదో? సుందరియగు చంద్రము జీవించియున్నదా? లేక యామోహనాకృతి జగమువిడిచి యెగిరిపోయినదా? శ్రీధరరావామె నేమొనర్చెను—ఏమి జరిగినది?

రామరాజు దీపముతో బ్రవేశించెను. అకస్మాత్తుగ నాయింటిముందు భాగము విస్పష్టముగ గనబడజొచ్చెను. పగటిచుక్క వెలుగులో నిలచియుండెను. రామరాజు సమీపించెను. పగటిచుక్క వాకిటికడ్డము తొలగెను. వెలుగింటిలోనికి బ్రసరించెను—కన్నులు తిరిగెను. ఇరువురి ముఖములును

వెలవెలఁబోయెను. వారు నిశ్శబ్దముగ లోన బ్రవేశించిరి. ఇల్లంతయు వెలుతురుమయ మయ్యెను. ఆ భయంకర ప్రదర్శనము—అచటివస్తువులు స్పష్టముగ గనబడుచుండెను.

పగటిచుక్కయు, రామరాజును పాలిపోయి గంభీరమైన వదనములతో చంద్రము శవము నెదుట నిలిచిరి. ఆమె ముఖముపై చేతిరుమాలుంటచే నది కనఁబడుట లేదు. దేహము చెక్కుచెదరినట్లగపడ లేదు. ఎచ్చటను నెత్తురు చుక్కయైనను లేదు. చేతులు, కాళ్ళుమాత్ర మొకమాదిరిగ వల్లబారి యుండెను. దానిలో తడి లేదు. ఆమె యాకారము సగముచాపపైనను సగముక్రిందను బడియుండెను. ఇతర వస్తువు లేమియు గదలింపబడినట్లు లేదు. దీపపుబుడ్డి గోడప్రక్కన బడియుండెను. నూనె నేలపై గాఱి యినికిపోయిన మచ్చ కనఁబడుచుండెను.

పగటిచుక్క వంగి చంద్రము ముఖముపైని చేతిరుమాలు విప్పెను. ఆవదనము భయమనునది పగటిచుక్క మొదటిసారి తెలిసికొనెను. రామరాజు తటాలపడి చూడఁ జొచ్చెను. చంద్రము వదనము మిక్కిలి నల్లవాఱి యుండెను. దంతములు నీలికప్పు వేసిపోయి గట్టిగా కఱచుకొనెను. పెదవులు బొగ్గులవలె నాయెను. కణతలపై నెత్తురునాళములు నల్లత్రాళ్ళవలె నుబికెను. శిరోజములు చిందర వందరయాయెను. కన్నులు మండి బూడిదయై నట్లుండెను—పగటి

చుక్క తటాలున నామె ముఖముపై రుమాలువేసి వెలు పలికి రమ్మని రామరాజునకు సైగచేసెను. ఇరువురును వెలికి వచ్చిరి. పగటిచుక్క తలుపుమూసెను.

దీపమార్పివేయుము! అని యాతడు మెల్లగా ననెను.

రామరాజు దివ్వెనార్పెను. మరల గాఢాంధకారము.

రామరాజు! రమ్ము. చంద్రమునుగూడ గర్తపుర మున కప్పగించినారము రమ్ము అని దీనముగా ననెను.

ఇరువురును నడువజొచ్చిరి.

కొంతదూరము చనినతరువాత పగటిచుక్క యిట్ల నెను. "అయిపోయినది" చంద్ర మదృష్టవంతురాలు! ఆమె మనస్ఫూర్తిగా మరణించినది. ఆత్మహత్య—శ్రీధర రావు ప్రబోధించి యుండును. నీ వేమనుకొనెదవు!

నేను నీ యభిప్రాయము నంగీకరించు చున్నాను. ఆమె విషము పుచ్చుకొనన ట్లున్నది—ఆగ్లాను!

పగటిచుక్క మరల యోజింపజొచ్చెను. నిశ్శబ్దముగా వారు కొంతదూర ముపక్రమించిరి.

మూడవశవము! దీని నేమి చేయుదము? అని రామ రా జడిగెను.

ఆ శవమువలెనే దీనిని పూడ్చివేయింతము—బలరాం పేటలో మన మేడవెనుకనున్న తోటలో నీమెను విడిగా భూలీన మొనర్తము.

ఇప్పు డాయేర్పాటులు చేయుదము ?

వెంటనే.

పిమ్మట ?

జేపు లక్ష్మీపురమునకు వెళ్ళు ఏర్పాటు లొనర్ప వలెను.

మనగుంపు నెప్పుడు చీల్చివేయుదము ?

నేటిరాత్రియే. గొప్పగొప్ప బహుమానములిచ్చి మన సేవకులవీడ్కొల్పుదము.

సరే.

ఇరువురును జకచక బలరాం పేటవైపు దారిపట్టిరి.

---

## ముప్పదియవ ప్రకరణము.

### అన్న — చెల్లెలు

ఇట్టి విపులగ్రంథములయందు ప్రతివిషయము విశదముగా వర్ణింపజాలము. గ్రంథవిస్తరభీతి ప్రతివారికిని సామాన్యమే. కావున పగటిచుక్క గర్తపురము కడసారివిడుచుటకు ముందచట జరిగిన విషయములు క్లుప్తముగా దెలిపెదను.

మున్ముందు హత్యలవిషయము ప్రాకుచ్చెదము శ్రీధరుని శవమును, అప్సరఖము కళేబరమును మిక్కిలి రహస్యముగా రాధాయప్సర మేడవెనుక గోతులయందు. బాతిపెట్ట

బడియెను. మేడ పైభాగము పరిశుభ్రము చేయబడెను రాధాయమ్మకుగాని తదితరులకుగాని లేశమును సంశయము లేకుండ పగటిచుక్క పనులు జరిగించెను. తరువాత చంద్రము దేహము సహితము బలరాంపేటలో తన మేడవెనుక తోటలో నతిగూఢముగా నాతడు పాతిపెట్టించెను. అట్టి వేవియు నాతనికి దొరకలేదు.

పిమ్మట బలరాంపేటలోని మేడలో నొకసభ జరిగెను. దానిలో బగటిచుక్క గుంపులోని వారందరు నుండిరి. పగటిచుక్క పెద్దయుపన్యాసమిచ్చి తానధికారము చాలించుకొనుచున్నట్లును — కేవలము హృదయపూర్వకముగా మాత్రము కాదనియు నొక్కిచెప్పెను. అందరును తమతమభేదము బహువిధముల దెలియజేసిరి. వారు మిక్కిలి విచారించిరి. సహజమే పగటిచుక్కవంటి ధీమంతుడును— సజ్జనుడును—దానపరుడును వారికి సురల లభింప డని వారి దృఢవిశ్వాసము. తరువాత రామరాజును. పగటిచుక్క వలెనే, తన మంత్రిత్వము తానదే కారణముల వలన ద్యజించుచున్నట్లు తెలిపెను. మరల గొంత కలవరము జరిగెను మరియొకని బగటిచుక్క యధికారమున కేర్పాటు చేయు నటుల సింహాచలము చెప్పెను. అప్పుడు కొంతచర్చ జరిగెను. అందఱు నేకగ్రీవముగాను—పగటిచుక్క రామరాజుల పూర్ణసమ్మతముతోడను—తురేమోహన్ అను వానిని క్రొత్త నాయకునిగా నేర్పఱచిరి.

పగటిచుక్కయు, రామరాజును తమ నమ్మిన బంటులకు గొప్పగొప్ప బహుమానముల నొసగిరి. తురేమోహన్ శిరముపై బగటిచుక్క స్వహస్తములతో నధికారసూచకమగు కిరీటమునుంచెను. భటులు కరతాళధ్వను లొనర్చిరి. ఈక్షణమునుండియు తురేమోహన్ పగటిచుక్క—నుతి పగటిచుక్కయో ? అతని నిక ముందు జస్వంతరావని పిలిచెదము. తురేమోహనుడు పగటిచుక్కయను బిరుదముంచుకొనియే తీరవలెనను. కట్టుబాటులేదు. అతడు దానిని మార్చుకొనవచ్చును, కాని పగటిచుక్క తనయధికారముతో బాటు పేరుకూడ అనగా బిరుదుకూడ నసుసిన బాగుండుననివచించెను. ఒక్కరును దీనికి సమ్మతింపరైరి. కాని తురేమోహన్ చెప్పినట్లు—పగటిచుక్క యనుపేరు నిలిచియే యుండెను.

పగటిచుక్కయొద్దను, తన మిత్రులయొద్దను సెలవుగైకొని జస్వంతరావు రామ రాజసహితుడై రాధాయమ్మ యింటికేగెను. తమ పెండ్లియైనపిమ్మట నెంటనే యొక మారును—తరువాత నప్పుడప్పుడును దమను జూచిపోవునట్లు దృఢవాగ్దత్తముల వారిద్వారి యొద్దనుండియు తురేమోహనును, నాతని గుంపును గైకొనినపిమ్మటగాని వారిని వెడలనీయలేదు. వారి ప్రేమకును, విశ్వాసమునకును జస్వంతిరా వెంతయు సంతసించి కన్నీటితో వారిని విడిచెను. నిష్కపట హృదయుండగు రామరాజు వేశ్వేర నొక్కొక్క స్నేహితుని గౌగలించుకొని, యెంతయో ప్రయత్నముమీద

వారిని వీడ్కొనెను. వారిజన్మ మార్పుజెందక పోవుచున్నదని వారిద్వారికిని దేటతెల్లమే.

ఓంకారము, నాతనితల్లియు నాలుగువేల రూక లొసగబడిరి. ఆమేడలోనే వారినుండుమని జస్వంతరా వేర్పాటుచేసెను. మరల జన్మలో వారిని జూచుటకు దామెవ్వరును రాదలచుకొనలేదు. దారులు చీలెను. ఓంకారము, నాతని తల్లియు గర్తపురము విడుచుట కంగీకరించిరి. రాధాయమ్మయు శ్రీముఖియు, బుగము నాదినము విడుచుటకు దగిన ప్రయత్నములు చేసికొనిరి. మఱునాడీగుంపు—అనగా జస్వంతరావు, రామరాజు గోవిందంపంతులు, రాధాయమ్మ శ్రీముఖి—నీ యైదుగురు 'రైలు' లోనెక్కి లక్ష్మీపురము బయలుదేరిరి.

సాయంసమయమాయెను. లక్ష్మీపురములో ధారా మందిరము ముందున్న పూలమొక్కలనడుమ కొయ్యబల్లపై మాణిక్యమును, పద్మయు—(ఇక లలితయను మారుపే రుపయోగింపము) గూర్చుండి సంభాషించుచుండిరి మాణిక్యము జస్వంతునితల్లిని ధారాళముగ 'అత్తా!' అని సంబోధించుచుండెను. వారు పువ్వులలో జాతులను వానిలోని చిత్రములను సుందర వర్ణములను-సుకుమార రూపములను-సుగంధ విశేషములను గూర్చి ప్రసంగించుచుండిరి. ఆసమయమున మిక్కిలి తలవనితలంపుగ జస్వంతరావట కేతెంచెను. వారిద్దరు నాశ్చర్యముతో లేచిరి—నిశ్చాంతపడినట్లు కన్పట్టి

చున్నవారిని జూచి శాంతముగా నవ్వుచు జస్వంతరావు తలవని తలంపా ! అని అడిగెను.

మిక్కిలి! అని మాణిక్యము చెంగుచెంగున నాతని సన్నిధికి వచ్చెను,

నిజముగా నింతత్వరలో వత్తువని నే ననుకొనలేదు! అని పద్మ కుమారుని సమీపించెను.

జస్వంతరావు వారినుభయుల దగురికిని సమాదరము గావించి యిట్లనెను 'అవునమ్మా నేనువెళ్ళి సుమారు వారము దినములైనది. తలవనితలంపేసుమా! మీకు మిక్కిలి నేనెట్టి శుభవార్తలు తెచ్చియుంటినో మీకెఱుక లేదు.

చెప్పుము—పద్మ యాత్రముగా నడిగెను.

మనవిరోధు లిద్దరును మనబంధువులే; అని జస్వంత రావనెను.

ఎట్లు గోవిందంపంతులు కూడ ?

ఔను—అతడు—మాణిక్యం; నీకన్న తండ్రి గోవిం దం పంతులు.

ఆశ్చర్యాతిశయమున మాణిక్యమును, పద్మయు గూలబడిరి. మబ్బులేని పిడుగైన నంతయాశ్చర్యమును గలిగించి యుండదు.

ఎట్లు? ఎట్లు? జస్వంతా! త్వరగా చెప్పుము నన్నుం పుడు కత్తెగా గొని నాయూవన నుపహరింపజూచిన పురు

షోత్తమరావు—దొంగపేరు. పెట్టుకొనిన గోవిందంపంతులు—నా—నన్ను కన్నతండ్రియా ?

పిచ్చిమాణిక్యం! అవును. ముమ్మాటికిని అవును! మఱి మీతల్లిపేరు చెప్పిన నీవాశ్చర్యమున నేమగుదువో !

భగవంతుడా! ఆమె యెవ్వరు ?

నీవెఱిగిన స్త్రీయేసుమా !—రాధాయమ్మ.

నిజముగా మాణిక్యమునకు బిచ్చియెత్తినట్లుండెను. పద్మ విభ్రాంతితో, తనకుమారుని మనస్సు చెదరలేదుగదా యని శంకించుచు భగవంతునికి మ్రొక్కుకొనుచుండెను.

సరిగా నాసమయమున రామరాజు వచ్చెను. అది జస్వంతుని యేర్పాటు. జస్వంతరావు తల్లితో అమ్మా! మీరిద్దఱు రామరాజువెంట నరుగుడు. నేను మేడపైకేగి మధుసూదనరావుగారితో యీచరిత్ర యంతయు జెప్పి వారిని బంధువులసమాదరింప నాయత్తముచేసెదను.

వామనరావును పైననేయున్నాడు అనిపద్మ చెప్పెను.

మఱియు మంచిది.

కాని, మేము రామరాజుతో నేగుట యెక్కడికి ?

ప్రస్తుతము గోవిందంపంతులు మొదలైనవా రున్న బసకు.

రామరాజు బండి సిద్ధముగ దెచ్చియే యుండెను. పద్మయు, మాణిక్యము నాశకట మధిరోహించి రామరాజుతో వెడలిరి. జస్వంతరావు మేడపై కరిగెను.

మధుసూదనరావును, వామనరావును జస్వంతరావు రాకకు మాణిక్యము, పద్మలతవలెనే మిక్కిలి వింత చెందిరి. జస్వంతరా వాసీనుడై యిట్లనెను.

తలవనితలంపుగా రావలసివచ్చింది—ఇంకను దాచ నేల? మాణిక్యము అసలు తల్లిదండ్రులు దొరికినారు!

మరల నుఱుములు లేని పిడుగుపడినట్లయ్యెను. జస్వంత రావు వారికోరికమీద జరిగినసంగతి—అనగా మాణిక్యము తల్లిదండ్రులవిషయము తానెట్లు కనుగొన్నది వారికి బూస గ్రుచ్చినట్లు తెలిపెను—గాని తండ్రి గోవిందపంతులని చెప్పక "ఒక పురుషుడు — ఒక పురుషుడు" అని దాచి చెప్పెను. కారణము చదువరు లూహించుకొనియే యుం దురు. నిజముగ మధుసూదనరావు తామనుకొనినట్లు సతా రామేయైన—గోవిందపంతులు మాణిక్యముతండ్రి యను సంగతి తెలియుటతోడనే తనగుట్టు బయటపడుననియు— గోవిందపంతులు తనను గుర్తించుననియు ననుమానపడి తప్పించుకొనువఱ కాలోచింప వచ్చును. అట్లుగాక యాక స్మికముగా వా రొండొరులం జూచుచు తటస్థించినసంగతులు తమంతటనే వెలువడునుగదా ఈ మారాలోచనతో జస్వంత రావు గోవిందపంతులుపేరు దాచెను. మాణిక్యముతల్లి రాధాయమ్మ యనియు నామె నిజనామము అలివేలుమంగ యనియు తెలిపెను.

మధుసూదనరావును, వామనరావును మిక్కిలి వింత చెంది తమ నూతనబంధువుల నెప్పుడు చూడనగునా యని వేచియుండిరి. కొంతసేపు వారు ప్రసంగించుచుండ నింతలో వెలుపల బండివచ్చిన మ్రోత వినవచ్చెను. జస్వంతరా వా గదిలోని పెద్దజ్యోతి వెలిగించి క్రొత్తచుట్టముల నీగదికి దెత్తునా? అని మధుసూదనరావు నడిగెను.

తెమ్ము—అభ్యంతరమేమి ?

మాణిక్యముతండ్రి కూడ నున్నాడుగదా? అని వామనరా వడిగెను. తల్లిని నేను గుర్తింపగలను.

ఉన్నాడు—చూచెదరుగాక ! అని జస్వంతరావు మేడక్రింది కేగెను.

అచిరకాలములో నెల్లరు మధుసూదనరావుగది ప్రవేశించిరి. కాని యిచట పకటిచుక్క కలలోనైన దలవనివియు—ఎవ్వరు నెప్పుడు ననుకొననివియు నగు కొన్ని మహాద్భుతములు జరిగెను.

ముందు జస్వంతరావును, తరువాత గోవిందంపంతులును మేడపై గది ప్రవేశించిరి. గోవిందంపంతులు మధుసూదనరావు చూచుటతోడనే తెల్లవోయెను. ఆతనిజూచుట యాలస్యముగ గోవిందంపంతులు ముఖమును పాలిపోయెను.

స—తా రామా ! అని గోవిందంపంతు లనెను.

గో—విం—దం—అని మధుసూదనరావు మాట ముగింపకమునుపే రాధాయమ్మ యా గదిప్రవేశించెను. ఆమెను

జూచుటతోడనే మధుసూదనరావు నిర్ఘాంతపడి మాటాడలేక శయ్యపై వ్రాలెను.

రాధాయమ్మ యాతని స్పష్టముగా జూచి కెవ్వున కేకవేసెను.

అన్నా! సతారాం! అన్నా! అన్నయ్యా! అనుచు నామె శయ్యమీద బాణమువలె వ్రాలెను.

అలివేణీ! అనుచు సతారా ముచ్చరించి చెలియలును గౌగలించుకొనెను. అచటనున్న యెల్లవారు దిగ్భ్రమను జెందిరి.

---

## ముప్పదియొకటవ ప్రకరణము



### బీరకాయ పీచు

మన మెల్లరము సామాన్యముగా సంబంధముల విషయము వచ్చినప్పుడు—సంబంధములు మిక్కిలి దగ్గఱవైనపుడు 'బీరకాయపీచు' అనుమాటను వినియున్నారము బీరకాయపీచు చీకిరిబీకిరిగ నల్లుకొని మిక్కిలి చిక్కుగాను, ఒక్కొక్క ప్రత్యేకపు వారమునకు మిగిలినవానితోఁ బెక్కింటితో నాత్మబాంధవ్యము నుండును. ఆ ప్రకారమే మన మొక పెద్దకుటుంబమును దీసికొని బీరకాయతో బోల్చవచ్చును. ఆకుటుంబములో నొకరికొకరికి బాంధవ్యమొక

విధమును మించి, మెల్లరు నౌకరికొకరు కడుగూర్చు చుట్టము లైనపుడు మనమాకుటుంబ బాంధవ్యముల విశదీకరించుచో 'బీరకాయ పీచు'ను వాడుదుము.

ఇప్పుడు జస్వంతరావుకుటుంబము నట్లయాయెను. వారిలో నౌకరి కొకరికి నొకవిధముగకంటె జుట్టరిక మేర్పడెను. మధుసూదనరావును దీసికొనిన—నాతడు జస్వంత రావుభార్య పెంపుడుతండ్రి, అసలు మేనమామ, గోవిందం పంతులుగారియొక్క ప్రాతస్నేహితుడు నైయుండెను. ఇట్లే మిగిలినవారి నొక్కొక్కర దీసికొని చూచిన నేక సంబంధములు బయలు వెడలును.

అచటనున్నవారిలో 'కన్నపుదొంగ' చదువనివారు లేరు. పనునాతేండ్ల క్రిందట ప్రచురింపబడినను ఆ పుస్తకము లోని యంశములచటివా రెవ్వరును మఱవలేదు. అలివేణి సతారాము చెల్లెలనియు, సతారాము గోవిందంపంతులు కన్నపు దొంగయగు జనార్దనరావు హస్తద్వయమని వారెఱుగుదురు. గోవిందంపంతులు, అలివేణియు, విచారణసమయమున బలాత్కారముచేసి సంగతియు నెల్లరు నెఱుగుదురు. సతారాము అజన్మద్వీపాంతరవాసశిక్ష విధింపబడియెను. కాని సుమారైదు సంవత్సరములక్రిందట నాతడెట్లో తప్పించుకొని వచ్చెను. ఆతనిబట్టి యిచ్చినవారికి బహుమాన మిత్తుమని దొరతనము వారు ప్రచురించిరి. కాని సతారా మెదురులకు

దెలియకుండా లక్ష్మీపురములో మేకొని యచటమధుసూదన రావను పేర నివసించుచుండెను.

అలివేణియాశ్చర్యమునకు మేర లేదు. గోవిందంపంతులు రంగూన్ వాసియనియు, తనయన్న—కన్నపుదాం గకు సహాధ్యాయియనియు నామె యెఱుగును. కాని యామె యాతని నెప్పుడును జూచియుండలేదు. అందుచే నిట్టి చిత్రము జరిగెను. పారిపోయినవా రిద్దఱును క్రొత్తలోనే కలిసికొనిరి. ఒకరి నొకరెఱుగుదురు. మొన్న పగటిచుక్క— గర్తపురములో దమును గుర్తించి మాణిక్యముతల్లిదండ్రుల నుగా దెలిసినప్పుడాతడు గోవిందంపంతులును నాపేరునే సంబోధించెను. కాని యాంతత్తరపాటులో నామె యాపిషయము గమనింపలేదు. ఒకవేళ గమనించినను రంగూను గోవిందంపంతు లితడని యామెయెఱుగదు.

ఈశ్వరకృత్యములచిత్ర మేమనవచ్చును? లవలేశము సందేహము లేక రాధాయమ్మయు బురుషోత్తమరావు అను పేరుతో నొకరి నొకరు విసకిడిమూలమున నెఱిగినఅలివేణియు, గోవిందంపంతులు ప్రచండనాటక మాడుచుండిరి. ఏగోడు నెఱుగకయే మధుసూదనరావు పేర సతారాము లక్ష్మీపుర ములో దన చెల్లెలి కూతును బెంప జొచ్చెను. స్వల్పాను మానమును లేకయే జస్వంతిరావు తనవిరోధుల బంధువు రాలను మాణిక్యమును ప్రేమింపజొచ్చెను. మాణిక్యమును, శ్రీముఖియు నక్క— చెల్లెండ్రను సంశయము లేకయే జస్వంతి రావు కామరాజు వారిని ప్రేమించుచుండిరి.

వింతలో వింతగ జస్వంతరావు తానే లోకవిదితుం డగు పగటిచుక్క యని మధుసూదనరావునకు; వామన రావునకును దెలిపెను. కొంతకాలము వారీవిషయమును నమ్మజాలరైరి. నవ్వుచు జస్వంతరావు తానాచోరనాథుడే యని దృష్టాంతములచే నిర్ధారణపరచెను. ఆవింత కొంతి యడగినపిమ్మట జస్వంతరావిట్లనెను 'కర్తవ్యమును గూర్చి విచారింపవలసియున్నది. కాని యాసంగతి తేల్చుటకు ముందు క్లుప్తముగా సతారామునుగారును అలివేణియు, గోవిం దంపతులును తమతమ చరిత్రల జెప్పిన మాకు ద్రేకమును - అభిలాషయు గొంత దీరును' దీని కెల్లరు సమ్మతించిరి. సతా రాము గొంతు చెప్పెను. అతని వృత్తాంత పర్యవసానమును, మిగిలినవారి చరితముల సారాంశముల మాత్రమిందు మేము మాస్వంతివాక్యముల నిచ్చుచున్నారము — అదియు మిక్కిలి క్లుప్తముగ.

సతారాము అండమాను ద్వీపములలో బదేండ్లపాటు తనగడ్డి తాను తినెను. పిమ్మట నాతనికొక్కనితో ప్రాణ స్నేహమయ్యెను. ఆతనికొక ధననిధానమున్న ప్రదేశము రెండు సంవత్సరములనుండియు దెలిసియుండెను. దానిసాయ మున నెట్లయినవారిద్దరు తప్పించుకొన నదనుకువేచియుండిరి ఎట్టకేలకొక సంగపడవలో వారెక్కి ధనముతో గూడ బలా యన మొనర్చిరి. హిందూదేశములో దిగినపిమ్మట వారు ధనము పంచుకొని ఫిసిపోయిరి. సతారాము కొంతకాల

మచట నిచట దాగుచు గడపి—తను పలాయనముసంగతి కొంత కాలమణగిన తరువాత మిక్కిలి ధైర్యముగ లక్ష్మీపురములోని తారామందిరమునుగొని, యేరికిని ననుమానము లేకుండ నందు వసింపజొచ్చెను. తరువాత సంగతులందరికి దెలిసియేయున్నవి.

గోవిందపంతు లట్లు విచారణ కాలమున బలాయనమొనర్చి, కొంతధనంబుతో పుర బుల గ్రుమ్మరుచు మల్లాపురములో అలివేణితో బరిచయము చేసికొని యామెతో గొన్ని దినములు గడపెను. తరువాత నాతడు కనకపురము చేరి యచట నొక గృహమును, దానికి బశ్చిమమున దాసరిపల్లెలో నొక మిద్దెయు గొని యిచట నచట నివసించుచు, ఆత్మసుఖము నుబుసుపుచ్చుచుండెను. పిమ్మట దలవనితలంపుగ నాతనికి నోంకారముతో బరిచయమై మాణిక్యము నమ్మగు రని తెలిసెను. ఆ బాలిక నుంపుడుకత్తెగా గొనుటకై యాతడు గర్తపురములో రాధాయమ్మ యింటికేగెను. అచ్చటినుండియు జరిగినవృత్తాంతము లింకను విశదీకరింప బడియే యున్నవి.

రాధాయమ్మగా గర్తపురముననివసించిన అలివేణియు దన కాలము నించుమించుగా గోవిందపంతుల వలెనే పుచ్చెను. మల్లాపురములో నామెకు గోవిందపంతులుతో స్నేహమాయెను. పిమ్మట తన సంతానమును (మాణిక్యమును) శ్యామరావుగారి వాతనునైచి గర్తపురము లేచివచ్చెను.

అచ్చట ఓంకారముతో బరిచయమై యామె గ్రాంతనివలన శ్రీముఖిని గనెను. పిమ్మట నామెయు జ్వాలయు ఓంకారమును గలిసి జవ్వనుల బానిసలుగ నమ్ము పన్నుగడ పన్ని యిర్వుర దొంగిలించి తెచ్చి, యమ్మి, ధనము కూర్చి, మేడను గొని, యందు వసించుచు దమవృత్తిని సాగించుచుండిరి. తరువాత మాణిక్యము నెత్తుకొనివచ్చుట దగ్గఱనుండియు జరిగినసంగతులు చదువరులకు దెలియును.

ఇప్పుడు చదువరులకొక సందేహము తోచవచ్చును. ఇట్టి అలివేణి కూతును పెండ్లాడ జస్వంతరా వెట్లు నిశ్చయించుకొనెను! మేమిదివఱకే కొంత సమాధాన మొసగి యున్నారము. జస్వంతరావునకు గుణమే ప్రధానము— మీదుమిక్కిలి తనజన్మకు మాణిక్యము బాధ్యురాలా? విశేష లోకానుభవము గలవారి కిట్టి యనుమానములు తృటిలో నశించును.

పగటిచుక్కను దనవృత్తాంతము చెప్పుమని యచటి వారు బలవంత పెట్టిరి—అనగా దానుపగటిచుక్క యగుట— ఆదిగాగల విషయములు కాని జస్వంతరావది సమయము కాదనియు, దరువాత సావకాశముమీద జెప్పుమనియు దప్పించుకొనెను. విషయమేమన—నాతడు వారికి తమ చోరనాథుడుగా నున్నప్పటి ప్రవర్తన జెప్పదలచికొనలేదు. దానిలో చంద్రం, శ్రీధరుల విషయములు రావలసివచ్చునని యాతనికి బాగుగా దెలియును. అందుచే బిమ్మటగూడ నాత డెన్న

డును, వారికావిషయములు, తదీయరహస్యమును జెప్పనే లేదు. మాణిక్యము సహితము వాని నెఱుగదు.

పగటిచుక్క యుద్యోగముతో నాసంబంధ రహస్యములు సనసెను.

-----

## ముప్పదిరెండవ ప్రకరణము

### భవిష్యత్తు

సతారామునకున్న భయము నశించెను. అచటివారందఱును దనయాప్తకోటియే. ఇక దనగుట్టు బయటపెట్టువారెవ్వరు? వామనరావును, మాణిక్య శ్రీముఖులును దక్కయచటివారందఱును దొరతనమువారి విరోధులే. సతారామును, పగటిచుక్కయు, రామరాజును, అలివేణియు, గోవిందదంపతులును—ఈ యైదుగురును నేదోవిధముగ దొరతనమువారి యెదుట నపకారముచేసి—అనగా ప్రజలకని తాత్పర్యము వారిచే బట్టువడిన శిక్షలపాలు కావలసినవారలే. పద్మ మాత్రము పగటిచుక్క తల్లియనుట కంటె నేవిధముగను నింద్యురాలు కాదు. కాబట్టి తమగుట్టు నితరులు బయటపెట్టుదురేమో యని యెవ్వరికిని భయములేదు. అందఱు ధైర్యముగా నుండిరి. అప్పుడు పగటిచుక్క యను పేరు తానిక విసర్జించినట్లు విశదీకరించి జన్మాంతరా విట్లనెను.

మన యీచరిత్ర పెద్దకాటకమువలె నున్నది. దీనిని గురించి వింత చెప్పుటకును నవ్వుకొనుటకును నికముందు జాలకాలమున్నది. ప్రస్తుతము భవిష్యత్తునుగూర్చి యోజింప వలసియున్నది.

అవును--ముఖ్యముగా, అని సతారా మనెను.

మనమిక లక్ష్మీపురములోగాని, యీ చుట్టుప్రక్కల గాని యుండుట పొసగదు. క్షేమకరముకాదు. కారణము మనలో బెక్కురు దొరతనమువారి కనుమానాస్పదుల మగుటయే.

ఈపురము——చుట్టుపట్ల పట్టణములు ఎంత త్వరలో విడిచిన నంతమంచిది. అని సతారాము దృఢముగాజెప్పెను.

నీవేమైన నాలోచించియుంటివా ? అని వామనరావు జస్వంతరావు నడిగెను.

యోజించియుంటిని. నావాక్యములెల్లరు నేకకంఠముగా నంగీకరింతురుగాక. ఈక్షణమునుండియు మనమెల్లర మొక్క కుటుంబములోనివారము. ఒక్కయింట నుండవలసినవారము. మరణముతప్ప మనల నేదియు జీల్చి వేయలేదు. నేటినుండియు మన మొండొరుల నెడబాసి యుండజనదు. కోయంబత్తూరు మన భావి నివాసస్థానము. అచట నొక గృహము విలువకు దీసికొందము. అందఱమును నిక వారము దినములనుండి కోయంబత్తూరు నివాసులమగుదము. నేను నెడలి గృహము

కుదిర్చి వచ్చెదను. రామరావు నన్ననుసరించును. మిగిలిన వారిచ్చటనే యుండుడు. మఱియొక విషయము గోవిందం పంతులు మొదలగువారు ఆజన్మాంతము మాయింట నుండుట కెట్టి సంశయమును బెట్టుకొనగూడదు. ఇక్కడనుండి పగలు విడిచితిమి కావున నెవ్వరికిని ననుమానమువలదు. సతా రాముగారు ధనికుడు భగవదనుగ్రహమువలన నాకును రామరాజునకును గూడ నైశ్వర్యమునందెట్టికొఱతయు లేదు. అందుచే నెవ్వరును పన్నుగడల కభ్యంతరము చెప్ప గూడదు.

ఎవ్వరును నభ్యంతరము చెప్పలేదు. చెప్పుటకు వీలు లేదనియు, జస్వంతుని యుపాయము సమంజసమైనదనియు నెల్లరు గ్రహించుకొనిరి.

ఎవరికైన సందేహముగ నుండినగాని జస్వంతరావు మరల జెప్పజొచ్చెను. ఎవరైన నింతకంటె మంచి యుపాయ మాలోచించినగాని నిశ్శంకగా దెలియజేయవలెను. సతా రాముగారు పెద్దవారు వామనరావుగారు యోగ్యులు. మీ కేమైన దోచిన దెల్పుడు.

వయస్సునకు పెద్దనుగాని నాయనా. బుద్ధికిగాను సుఖీ, సతారాము సమాధానము చెప్పెను. నీపన్నుగడకు నాకెట్టి యాటంకమును లేదు. నాయిరువురి మేనకోడళ్ళ దగ్గఱ నుండుటకంటె నాకు వేఱుసంతసము లేదు. నే యుపా యమీ సరి.

నా యభిప్రాయము నంతే అని వామన రావుగారు చెప్పెను.

జస్వంతరా విట్లనెను. "మంచిది అయిన తేపు ఎల్లుండి లోగా మేము కోయంబత్తూరు ప్రయాణము మీరు జాగ్రత్తగా నుండవలెను

భవిష్యత్తు తేలినదిగనుక యచటివారితరవిషయము లను జరిగిన చిత్రములనుగూర్చి ప్రసంగించుకొన నారంభించిరి. అవి చదువరులకు దెలిసినవిషయములే యగుట నిచట వ్రాయక విడిచివేయుచున్నాము.

---

## ముప్పదిమూడవ ప్రకరణము

## "సెలవు!"

మా యీ చిత్రచరిత్ర సమాప్తమైనది మా నాటకములో నైదవ యంకములో జవరరంగ మాడుచున్నారము. ఈ ప్రకరణముపేరు "సమాప్తము" అని పెట్టిన బాగుగ నుండెడిదని నామిత్రులు కొందఱభిప్రాయపడి నాకు దమ యుద్దేశమున దెలిపిరి. కాని "సెలవు" పుచ్చుకొను చున్నారము. ఓంకారమును, జ్వాలయు, గర్తపురములోనే యుండి తమ జన్మలో మరల నెప్పుడును తా మొకప్పు డెఱిగిన మన పాత్రల జూడలేరు వారు రాధాయమ్మ మొదలగు వారి యొద్ద బెద్ద "సెలవు" గైకొనిరి.

మా నవల లక్ష్మీపురములో ముగించుచున్నారము. కోయంబత్తూరు వెళ్ళుటకు ముందొక నాటిసాయంకాలము రామరాజును, శ్రీముఖియు నొకగదిలో విలాసముగ సంభాషించుకొనుచుండిరి.

ఇప్పుడు తెలిసినదిసుమా? అని శ్రీముఖి నగుమొగముతోడ ననుచుండెను. 'పగటిచుక్క యెట్లు చిత్రముగా మా గృహము ప్రవేశింపజాలెనో యిప్పుడు నాకు బోధపడినది.'

ఎట్లో? అని రామరాజు మందహాసముతో నడిగెను.

నీవే కారకుడవు

అబ్బా! యీనిందయేమి?

నేను నీకొక తాళపుచెవి నిచ్చితిని. దానిమూలమున నీవు ప్రహరీద్వారము కడచి, తోటదాటి మా మేడ వెనుకకు వచ్చుచుండెడివాడవు అచ్చటినుండి మఱియొక చిన్నతలుపు తాళపుచెవితో దెఱచి నీవు మేడ కొన్నిసమయములందు బ్రవేశించుచుండెడివాడవు ఇక నను దెలియదా?

తెలియుటలేదు. అని రామరాజు చిఱునవ్వునవ్వెను.

తెలియుటలేదు? అవునా! అనుచు శ్రీముఖి యాతని విలాసముగా జెక్కిలి పైగొట్టెను. 'నీవు టక్కరివి. పగటిచుక్క కుడిచేతివి. ఆతాళపుచెవి పగటిచుక్క కిచ్చుచుండి యుందువు. ఇం కేమున్నది? నీవు బదులుగ పగటిచుక్క మా మేడ తలచుకొనినప్పుడెల్ల బ్రవేశించు చుండెడివాడు. ఆతడు వచ్చిన దినమున నీవెన్నడును వచ్చెడివాడవు కావు. కాదా?

నిజ మూహించితివి! అని రామరాజు సమ్మతము సూచించెను.

అసత్య మెన్నిదినములు దాగును? అనుచు శ్రీముఖి సరసముగా ననెను. రామరా జానందించి యంజవ్వని చేయి గ్రహించి, లేతవ్రేళ్ళతో నాడుచు, అసత్యము దాగదు. ముఖ్యా

ముగా నాలక్ష్మియెదుట! అనుచు నాకరమును ముద్దాడెను. హర్షమున శ్రీముఖ యాతనికి దనకృతజ్ఞత తెలిపెను.

వేఱొకగదిలో పగటిచుక్క యును తన యధికారము సంధలి యుద్దేశమేమో తెలుపుచు జస్వంతరావు మాణిక్యము యొక్క అనుమానముల దీర్చుచుండెను.

అయిన దేశము బాగుచేయుతలపు మీ సంఘమువారికేల? అని మాణిక్య మాతని నడుగుచుండెను.

ఈశ్వరకృత్యముల వైచిత్రము మనము గ్రహింపఁ జాలము. మన మల్పులము; మన మనస్సు అల్పము మన చేష్ట లల్పములు. లోకములో నన్యాయము నడచి న్యాయము స్థాపింప పరమేశ్వరు డొక్కొక్కని నేర్పఱచు చుండును. కొంతపాపము నామూలమున శాంతింపజేసెను.

అయినను లోకములో నికువచ్చిన పేరెట్టిది? నీసద్గుణములనందఱు వేనోళ్ళ బొగడుచున్నారా? నిన్ను దొరతనమువారు పట్టుకొన యత్నించుటలేదా?

నిజమేసుమా. కాని లోకులు పలుగాకులనుమాట దీని కంటె నిజము. లోకము మాయ మాకుదుండు రా? అనుకొన సమ్మా. జిహ్వకొకరుచి—పుఱ్ఱెకొకబుద్ధి—నాలుకకొకమాట కాని మా చర్యలయందు దూష్యము లేవియులేవు. మేము కొందఱిని వధించినమాట వాస్తవమే కాని వారా హత్యలకు దగుదురు. అట్టి దుర్మార్గుల నాశనముకొఱకై భగవంతుడు మా సంఘమును సృష్టించెను.

కాని, జస్వంతరావ్! స్త్రీయుల మొనస్సుకొనువారు లక్ష్మపగిదా?

ఔను—ఔను జన్వంతరావు నవ్వుచు జెప్పెను. 'ధర్మాధికారిని మెచ్చుకొను చోరులుందురా? యముని శ్లాఘించు పాపులుందురా? కల్ల. కాని యముని కర్జములు నిందనీయములా? ఎన్నటికిని గాదు. తెలిసిన దా?

పోనిమ్ము ఆవిషయమై వాదించుకొన దలచుకొన లేను. మరేమి?

లోకములో పాపులనందరిని మనము శిక్షింపగలమూ? శిక్షింప లేము.

మఱి!

మాణిక్యం! లోకములో పాపులందరిని మనము శిక్షింప లేము. కాని మనసు శిక్షించినంతవఱుక జాలును లోకములోని విషకీటకముల—సరీసృపములన్నిటిని మనము చంపలేము. కాని వధించినంతవఱకు గొంత యుపకారమే యగును. జగములో పాపమంతయు నొక్కడే చేయగలడా? పుణ్యమంతయు నొక్కడే కట్టుకొనగలడా? ఎంత ధర్మకార్యములైన జేయుము; నీకు వచ్చు పుణ్యము కొంతమాత్రమే! మిక్కిలి స్వల్పభాగము పుణ్యమంతయు నీవార్జింపలేవు—ఎవ్వరును జన్మలో జేయజాలరు. కాన సంపాదించినంతవఱకు సంతసింతము. ఊరిలోని కల్ల సంపన్నుడు ఇతరులను తనతో బోల్చుకొని తన సిరికె ట్లుప్పొంగునో యదే ప్రకారము మనము తుష్టి చెందపలెను. ఏమందువు?

నిజము—నిజము వేదాంతము సంపుటాన నీను బరిచయము మందుట నాకు చిత్రముగ నున్నది.

సుందరీ! అది యొక వింతయా? మాయట్టిచోరుల కన్నిలక్షణములు నుండవలెనుకదా? అని జస్వంతరావు మందహాసముతో ననెను.

నీవు చోరమాత్రుడవా, జస్వంతా! అనుచు నను రాగమున మాణిక్యమాతని గాగలించెను.

పరిహాసమున కంటిని, జస్వంతరావు నవ్వుచు జెప్పెను ఇకముందు సంసారములో బడుటచే గొన్నింటిని విడుచుచున్నాడను.

ఏవేవి?

వినుము. నేను సెలవు చెప్పుచున్నవి వినుము, నా పగటిచుక్క యుద్యోగమునకును, సాహస కార్యములకును, కొన్ని దినములు లక్ష్మీపురమునకు సెలవు. ఇకనుండి పాపులను శిక్షించుయత్నములకు సెలవు కష్టలకును. దుష్టపు తలంపులకు, కృత్యములకును సెలవు. నావలన గష్టముల పాలై గతించిన కొన్ని కొన్ని సుందర మూర్తులకు సెలవు. నా తెగువపత్రికలం బ్రకటించినవారికిని, జదివియానందించిన వారికిని సెలవు—

అయిపోయినవా? ఆగితివే?

లేదు. అయిపోలేదు. ఇంకొక్కటి యున్నది. ప్రియురాలిచెంత లజ్జకు సెలవు. జన్మలో సెలవు!—అనుచు హాసముతో నాతడు మాణిక్యము పెదవిని ముద్దాడెను.

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల రాజమండ్రి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B111 |
| పుస్తకం పేరు | పగటిచుక్క 3 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | NO |
| తయారు చేసేవది | narma |
| పేజీలు విడదీసేవది | narma |
| స్కాన్ చేసేవది | [illegible] |
| పరీక్ష చేసేవది | THASIN |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | no good |